# పద్మవ్యూహము

venkat Rao.

అను

venkat Rao.  506.

## సైంధవసంహారము.

గ్రంథకర్త:


సోమరాజు పురుషోత్తమరావుగారు.



ప్రకాశకులు:

కాయల కన్నయ్యనాయుడు అండ్ సన్సు.

ప్రాప్తిస్థానము.

రామకృష్ణా బుక్ డిపో,

ఏలూరు.





రెండవకూర్పు 2000

ఏలూరు:

శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడినది.

1930




[ వెల రూ॥ 1—0—0

# వెలకు దొరకు గ్రంథములు.



| | |
|---|---|
| రామదాసు చరిత్ర (చిత్రపటశోభితము) | రు0—8—0 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు (శుద్ధప్రతి) | 0—12—0 |
| రామకర్ణామృతము (తాత్పర్యసహితం) | 1—0—0 |
| కృష్ణకర్ణామృతము (తాత్పర్యసహితం) | 1—0—0 |
| శతకరత్నావళి (ఇరువదినాల్గుశతకములు గలవు) | 1—0—0 |
| పోతన రత్నములు (భాగవతమందలి పద్యములు) | 1—0—0 |
| సతీపురుష రహస్యములు (చిత్రపటశోభితం) | 1—8—0 |
| శివానందలహరి (టీకాతాత్పర్యసహితం) | 0—8—0 |
| భగవద్గీత (తాత్పర్యసహితము) | 1—0—0 |
| వాస్తుసారసంగ్రహము (ఇందు కృష్ణ మరియు గృహ శల్యవాస్తులుగలవు) | |
| వైద్యచింతామణి—(ఇందు పెక్కుపురాతన గ్రంథములనుండి సంగ్రహించి ముద్రింపఁబడిన విషయములు గలవు ప్రతియింటయుండదగినది రెండుభాగములు | రు2—0—0 |
| భర్తృహరిసుభాషితము (తాత్పర్యసహితము) | 1—0—0 |
| వేమన రత్నములు (చిత్రపటశోభితము) | 1—0— |

**N. B.** కోరువారికి క్యేటలాగు వుచితము.

వలయువారు:—

కాయలకన్నయ్య నాయుడు అండ్ సన్సు

శ్రీరామకృష్ణాబుక్కుడిపో,

ఏలూరు.

# ఇందలి పాత్రలు.



## పురుషులు

| | | |
|---|---|---|
| 1 | ధర్మరాజు | పంచపాండవులు. |
| 2 | భీముఁడు | |
| 3 | అర్జునుఁడు | |
| 4 | నకులుడు | |
| 5 | సహదేవుఁడు | |
| 6 | దుర్యోధనుఁడు | కౌరవులు. |
| 7 | దుశ్శాసనుఁడు | |
| 8 | కర్ణుఁడు | |
| 9 | ద్రోణుఁడు | |
| 10 | సైంధవుఁడు | |

11 అభిమన్యుఁడు—అర్జునుని కుమారుఁడు.

12 సుమిత్రుఁడు—అభిమన్యుని సారథి

13 మయుఁడు—రాక్షసశిల్పి

14 కరండకుడు—వార్తావహుడు.

15 కృపుఁడు—ద్రోణుని బావ.

16 వేగవంతుఁడు—వార్తాహారి.

[illegible]లతుడు—సైంధవుని గూఢచారి.

18 దౌశ్శాసని—దుశ్శాసనపుత్రుఁడు.

19 సంజయుఁడు—కౌరవహితచింతకుఁడు.

20 ఘటోత్కచుఁడు—భీముని కుమారుఁడు.



## స్త్రీలు

21. దుస్సల—సైంధవుని భార్య

# కాలకేతనము

గ్రంధకర్త:—సోమరాజు రామానుజరావుగారు.

అత్యద్భుతమైన యీనాటకము యెన్నిసారులు చదివినను చదువవలయుననియే మనసు గల్గించును. యిట్టినాటకమిదివరకెవ్వరిచేతను రచియింపఁబడియుండలేదు. పద్యములన్నియు రత్నములు. పాటలన్నియు నవరత్నములు. ఒక్కొక్క పద్యము యెన్నిసారులు చదివినను దనివితీరదు. ఆలసించిన ప్రతులు దొరకనేరవు. నేడే కార్డువ్రాసి ప్రతిని దెప్పించుకొనుడు.

# బైరాగిచిటికెలు

కర్త, పురిటి బలరామదాసుగారు.

బైరాగిచిటికలను యీసద్గ్రంధము ప్రతియింటయుండవలసినదే? తేలు, జెర్రి, గాళి, మొదలగు విషజంతువుల కాటులకుచిట్కా. నాడిలక్షణములు జ్వరలక్షణములు జ్వరమునకుచికిత్సలు కాలినపుండుకుమంత్రం బెణుకుమంత్ర లేహ్యముచేయువిధములు సమస్తరోగము[illegible] మానవునికెన్నిరోగములుగల్గునో అన్నిరోగములకు యిందుబాగదివరచియున్నవి. ప్రతిగృహస్థునియింట యుండిన వజ్రాయుధమువలె పనిచేయును. నేడేపుస్తకముపరికింపుడు. వెల 0—8—0

వలయువారు:—

కాయల కన్నయ్యనాయుడు అండ్ సన్సు,
శ్రీరామకృష్ణ బుక్కుడిపో,
ఏలూరు.



శ్రీరస్తు.

# పద్మవ్యూహము.

## ప్రథమాంకము.

---

[యుద్ధభూమియందు: అభిమన్యుఁడు, సుమిత్రుఁడు]

అభి—సుమిత్రా!—భరతమాత కడుపునఁ బుట్టినందులకు ఫలితముగా—నామె దాస్యశృంఖలములను వదల్చి—ఋణము తీర్చుకొనినవాఁడే నిజమైన కుమారుఁడుగాని, స్వతంత్రేచ్ఛలేని మానవాధముఁడు, తల్లికడుపు చెఱపఁబుట్టినవాఁడే యగును సుమా!

పావనంబైనట్టి భరతసామ్రాజ్యము,
పరులచే పాలింపఁబడెడు వేళ
అన్యాయవిధమున నరిసమూహంబులు
మనకాంతలను చెఱఁగొనెడు వేళ
ధర్మచింతనలేని దుర్మతుల్ మనలను
కానల పాల్సేయఁ బూను వేళ
పాంచాలికా కేశబంధంబు చేపట్టి
యవమాన మొనరించు నట్టివేళ . .



తనకు స్వర్గమైన ధర్మప్రవర్తన
మెఱిగి శత్రువరుల కరములందు
జిక్కియున్న రాష్ట్ర మొక్కమ్మడిజయింప
దలఁపకున్నవాఁడు ఖలుఁడు గాఁడె?

సుమి— ఆయుష్మంతుఁడా! మీపెద్దతండ్రిగారు శాంతిప్రియు లగుటచే నిన్నినాళ్ళు మీకు వనవాసాఽజ్ఞాతవాసముల దీక్ష యడ్డు వచ్చెనుగాని— కానిచో దుష్టకౌరవాధములొనరించిన యపరాధశతంబులచే శల్యాశల్యాంతరములును ప్రబలబాధల నందుచుండు పాండవసింహములు కురుకుల మత్తగజేంద్రముల కుంభస్థలములఁ జీల్చి చెండాడుట కిన్నిదినములు కావలసివచ్చెనా? ఆనాఁడే యాతులువలు హతమారి యుండకుందురా!

అభి— సుమిత్రా!— ఈవిషయమున, నీవుసయిత మందమతితో పాటుగా పొరబడుచుంటివి సుమా! ఏమందువేని,

గీ. ధర్మవర్తను లగు పెదతండ్రిగారు
శాంతమే లోకమునఁ బ్రదర్శనముఁ జేయు
కున్న మాకు వారికిభేద మున్నెనుంత?
మేము ధార్మికజనుల మన్పించుకొనుట
కెల్ల ధర్మజు శాంతమే హేతువయ్యె
అందుచేఁ గాదె సకల జనానురాగ
మందినారము దుష్కీర్తినందకుండ

మాపెత్తండ్రిగారి శాంతవర్తనము హేతురహితము కాదు సుమా!

సుమి— ఆయుష్మంతుఁడా! మన మిప్పుడు సంగ్రామసవిధభూములకు వచ్చితిమి సుమా!

అభి—అట్లయిన మనరథమును-కౌరవప్రముఖులందఱు నున్న ప్రదేశమునకుఁ బోనిమ్ము.

సుమి—సౌభద్రా! మనంతట మనము కౌరవులపైఁ గాలుద్రవ్వ నేల? వారు డీకొనినపిదపనే చూతముగాక!

అభి—సూతుఁడా!—అట్లు కాదు సుమా!

గీ. పౌరుషముఁ గల వీరులు బాహుబలము
చేత సమవీరుల నెదుర్పఁ జెల్లునుమ్మి!
మత్తగజకుంభములు దిని మనుచు గాని
నీరసింపగ జేయ కంఠీరవంబు

సుమి—పోనిమ్ము; అట్లనుకొన్నను—మనము సమవీరులము కాము గదా! వార లారి తేరిన కౌరవయోధులు—మనము బాలురము.

అభి—సుమిత్రుఁడా! హేయమును, ఆకర్ణనానర్హమును, లజ్జావహమును నగుమాటాడితివిగదా?—బాల్యము శౌర్యహీనతకు సూచక మగునా?—

గీ. దిశల కాంతులు వెదజల్లు దీపకళిక
మానితాకార మెంచ సూక్ష్మమ్ముగాదె?
భయదకంఠీరవపాళిచయము లూడ్చు
శరభ మత్యంతహ్రస్వవిస్తార యగునె?

కావున సంశయముతోడ గాలయాపనముచేయక - సత్వరముగ మనయరదమును, కౌరవులున్న యెడకే పోనిమ్ము

సుమి—మహాభాగ్యము- (రథముతోలుచు అభిమన్యునితో నిష్క్రమింతురు)

[తరువాత- దుర్యోధన, దుశ్శాసన, కర్ణశకునులును, అశ్వత్థామయు ప్రవేశింతురు,

దుర్యో—మిత్రమా ! అంగరాజా ! దూరమునుండి రథస్థుఁడై-సూటిగా మనవంకకే వచ్చుచుండిన యీబాలవీరుఁ డెవ్వఁడో సరిగా పరికింపుము.

కర్ణ—ఆబాలుఁ డర్జునపుత్త్రుఁడగు నభిమన్యునివలె నున్నాఁడు:— ఔరా ! ఏమి వీనిసాహసము—!పదునాఱువర్షములు నిండియు నిండని, బాలుఁడు- ప్రతాపశాలివలె- మహోగ్నులం బడ నుంకించు శలభంబుమాడ్కి- వచ్చుచున్నాఁడే !

అశ్వ—కర్ణా ! పదునారేండ్లు నిండని బాలుఁడైనంతమాత్రమున నభిమన్యుని శౌర్యమలంతి యగునను కొంటివా— అతఁడు మనపాలిఁటి కాలుఁడై వచ్చుచున్నవాఁడు గాని బాలుఁడై వచ్చుటలేదు సుమా?—అభిమన్యుఁడనిన నేమనుకొంటివి ?

గీ. అర్జునుఁడు నీవు నేర్చిన యస్త్రవిద్య
నంతయును నేర్చె నీపాలియుమందె యితఁడు
గొల్లపిల్లని కూర్మిమేనల్లుఁ డౌట,
నిప్పటికె రణచాతుర్య మెల్ల నేర్చె

కృష్ణపార్థులే యీతనియెడల వ్యర్థులనవలసివచ్చినప్పుడు—నీనాటి సామాన్యులా యీతనిశౌర్యముం బరిహసించుట !

కర్ణ—ద్రోణతనయనీ ! తిన్నయింటివాసములు లెక్కించు ధీరునివలె నీవు కౌరవభోజనాశనుండ వయ్యును- పాండవాభిమానము గలవాఁడవైనం గావచ్చుఁ! అంతమాత్రముచేతనే- తలకు మీరిన విధంబున. నభిమన్యుని స్తుతించుటఁ జూడఁగా నాకు నవ్వువచ్చుచున్నది!

## ప్రథమాంకము.

ఉ. వీనులు కన్నులుం సరిగ విప్రునిబాలకు నోర్కనీక, జగ
న్మానిత శౌర్యశాలియు నమానుషవిక్రముఁడంచు పెద్దగాఁ
బూనివచింప నొప్పగునె? భూభుజు లీకురుయోధులుండఁగా
నీనుతివాక్యము, లనేకము వింటిమి; చాలు బాపఁడా!

అశ్వ—ఏమేమీ! నావాక్యములు కేవల నిరర్థకములును, స్తుతివాక్యములనియేకదా నీయభిప్రాయము. అట్లయిన పార్థకుమారశౌర్యము ప్రజ్వలించి, మీపైఁ దన తీవ్రసాయకసహస్రంబు జడివానకరణిం గురిపించినప్పుడు గదా, నాపలుకుల వాస్తవంబు నీకెఱుంగవచ్చుట!—

సీ. తనసముజ్జ్వలనకోదండటంకారంబు
దశదిశలనుబ్రతిధ్వనులనీన
తనఖడ్గదీధితుల్ ఘనవైరినేత్రసం
కాశంబునందు చీకటులు గ్రమ్మ
తనశిలీముఖము లుద్ధత వైరిదేహంబు
లందు చుఱుకుచుఱుక్కనుచు నాట
తసిదూషణంబులు ఘనవైరిమానస
శల్యాంతరముల శస్త్రముగ నాట
తనదు విజయనిర్ఘోషంబు దశదిశల ను
దంచితస్వనమునఁ బ్రతిధ్వనుల నీన,
కౌరవుల నేచ పార్థకుమారవరుఁడు
వచ్చుచున్నాఁడు తరుణము వచ్చెమీకు.

కర్ణ—ఓయలీకవాచాలా! కౌరవవంశాటవీదహన నిర్ధూమధామా అశ్వత్థామా!—

ఉ. వేరువుపార్థులైనఁ! బదివేవురు గోపకుమారులైన, నం
భావితమద్భుజాయుగళమండిత శౌర్యమహాగ్ని నార్పఁగా

నేవిధినైనఁ జాలరు సుమీ! గురుపుత్త్రుఁడ! శూరకోటి ప్ర
స్తావన విన్నమాత్రన గతాసుఁడ నౌటకు విప్రసూతి నే?

అశ్వ—(కోపముతో) ఏమంటివిరా! సూతాధమ!! కౌరవవంశాట
వీవహనదవానలుండవు నీవో నేనో, లోకమెఱుంగు—ధర్మ
జ్ఞులగు నీసభాసదు లెఱుంగుదురు!—యేమేమీ! శూరకోటి
ప్రస్తావన విన్నంతమాత్రమున, నడలి చచ్చువారము మేమఁ
టరా!—నీశౌర్య మెవ్వరెఱుంగనిదిరా! మూర్ఖా!! —

సీ. విప్రవేషంబున విద్యాపహృతి సేయు
వేళఁ బరశురాముఁ డెఱుఁగు
కడుపు భగ్గునమండి, కనలి నిన్ దిట్టిన
శాంతాత్మ యగు విప్రకాంత యెఱుఁగు
తన్ను బాధించినంతనె క్షుభితాత్తురయైన
పావనచరిత భూదేవి యెఱుఁగు
నీబాణములు రెండు నిష్ఫలంబగునన్న
జాబాలియను మునిశాప మెఱుఁగు
కవచకుండలములు గా జేసి, నిన్బల
హీనుఁ జేసినట్టి యింద్రుఁ డెఱుఁగు
ధరణి నెవరు నీప్రతాపంబు నెఱుగరు
శూరవచనమాత్రసూతపుత్ర.

(1. అనుబంధము)

కర్ణు—ఓరీ బ్రాహ్మణాధమ! పౌరుషపరాక్రమహీనులగు నీబోటి
పందలకుయున్న నిరర్థకశాపాట్టహాసములకన్న కర్తవ్య మింకేమి
యున్నది?

అశ్వ—ఓరి నిరర్థకవాచాశూర! కర్ణహంతక!! ఏమంటివిరా! నన్ను
నుటవనకాక—పరశురామాది మహాశూరులనుగూడ దూషిం

చి—పౌరుషపరాక్రమహీను లనుచుంటివిగా ! ఇట్టి విప్రద్వేషి లోకమున మనియుండుట మహాపాయకరము ! కావున— నీ దే నీతల తెగచున్నది కాచుకొమ్ము—

(కత్తిదూయును.)

కృపు—(అశ్వత్థామను పట్టుకొని) వత్సా! అతనికి శాంతములేకున్న నీకైన లేకపోవలయునా ?

దుర్యో—కర్ణుని పట్టుకొని) మిత్రుఁడా!నీవైన తొందరపడకుము— గురుపుత్రా ! పెద్దలమాట వినుము.

కర్ణు—మిత్రమా !— ఈబడుగు బాపని బెదరింపుల కేమి ? ఇతఁడు నన్నేమిచేయగలఁడు— రానిమ్ము— మామాబలాబలసంప దల సొంపు వీక్షింతువుగాక !

కృపు—(దూరమున లక్షించిచూచి) అదిగో! అభిమన్యుని రథ మిప్పు డు మనకు మిక్కి సమీపించినది. మన మంతఃకలహానిమ గ్నులమైనిరూపణచేయ లేమైతిమి.

దుర్యో—మిత్రులారా ! ఇది మనలోమనము కలహించుకొనఁదగిన సమయముగాదు—కావునఁ గర్తవ్యమాలోచింపుఁడు.

కర్ణు—కర్తవ్యమున కేమున్నది ? కలహమే కర్తవ్యము.

[సూతద్వితీయుఁడగు అభిమన్యుఁడు ప్రవేశము.]

అభి—సుమిత్రుఁడా! కౌరవయోధులం కలసికొనుటకు నా కిది ప్ర థమపర్యాయ మయ్యెను, అకొన్న సింహకిశోరమునకువలె నామనం బత్యాశాసంభరితంబై యున్నది సుమా !—

సీ. దుష్టకార్యోద్యోగి దుర్యోధనునిబట్టి
యరమర లేక చెండాడవలయు
నాతంద్రివైరియౌ సూతసుతుని చిత్ర
వధ జేసి ముమ్మారు వదలవలయు

ఈతంత్రిసమితికినెల్ల మూలంబగు
కుత్సితు శకునినిఁ గోయవలయు
రారాజసహజన్ముఁ గ్రూరాత్ము దుశ్శాస
నునిఁబట్టి కంఠము జెనకవలయు
మరియు నడ్డమువచ్చిన యరులనెల్లఁ
జీల్చి, చెండాడి, జయరమాశ్రీచెలంగ
నరిగి తండ్రిల కీవార్తయమితముదము
తో నెఱింగింపవలయు సంతోషముగను.

ఆప్పుడుగదా నా కానందము గల్గుట!

సుమి—ఆయుష్మంతుఁడా ! మరింత సమీపింతము రమ్ము.

(ఇరువురుపరిక్రమింతురు)

అభి—ఓరోరి కర్ణ దుర్యోధన దుశ్శాసన శకుని ప్రభృత దుష్టవర్గము లారా !—చిరకాలమునకు నాకంటఁ బడితిరిగదరా! దుష్టులారా! మీ రిప్పుఁడింక నెందు బోఁగలరు—నిలుఁడు—నిలుఁడు.

చ. నెలఁతను గొప్పబట్టుకొని నిండుసభాస్థలి కోక లూడ్చుటో
తలవడి మాయజూదమున ధర్మజు గెల్చుటయో—భరంపుగా
నల కలపాండురాట్సుతుల నాశము నెమ్మదిఁగోరి పంపుటో
ఖలమతులార! పార్థసుతు కయ్యము—కాచుకొనుండు శూరులై.

(అందరిపై శరములు వదలును.)

(కౌరవు లన్యోన్యము సౌజ్ఞలుచేసికొని అందఱు నొక్కమారుగా కయ్యముచేసి, తుదకు గెలువలేక పలాయితులగుదురు)

అభి—(క్రోధముతో కత్తిఝుళిపించుచు) ఓరి పరాక్రమలజ్జావిహీనులారా! ఏమిరా యిది?—ఆడువాండ్రు చేయఁదగిన పనిచేసితిరి?—

ఉ. ఏదెసకేగువార లిఁక నేయెడ నున్నదిమీకుదారి శౌ
గ్యోదితమైన నాదు భుజయుగ్మరణంబడియున్న మీరు, మి
మ్మాదుకొనంగ వచ్చు విక్రుతాశయు డెవ్వడొ కాంచువాడమీ
క్షోదురితాత్ములార! యికనున్నది మృత్యువు రెప్పపాటులో.

(వెంబడింపఁబోవును)

(తెరలో)

అభిమన్యకుమారా! శాంతింపుము. శాంతింపుము. తండ్రిగారితోఁ
గలసి ప్రయాణసన్నాహమందున్న మామగారు మిమ్ము వెం
టనే యొక్కమారాలసింపకుండ రమ్మని యానతియిచ్చినారు

అభి—(స్వగ) కటాకటా కౌరవహతకులు దైవానుగ్రహమున నిప్ప
టికి రక్షింపబడి కాళ్ళాలదిం బరువిడుచున్నారు .........
సూతుడా! మామగారియొక్కయు, తండ్రిగారియొక్కయు,
నాజ్ఞ మనకు సదా శిరోధార్యము కావున రథమును వెనుకకు
మరల్పుము వీరిసంగతి మరియొకసారి చూచెదను.

సుమి—(అభిమన్యునిజూచి) బాబూ! కుడిచేతిపై నెంత పెద్దగాయ
ముపడినదో నేనింతనుచూడనులేదు.

అభి—కౌరవులతోనైన దొమ్మియుద్ధమున దగిలినదికాబోలును—
సుమిత్రుడా! దీని కేమిభయము

సుమి—బాబూ! రథమునదిష్ఠించుడు బలమైనకట్టుయిసఁగట్టెదను

(ఇరువురురథము నెక్కుదురు)

తెరవ్రాలును

---

# రెండవరంగము



[సంగ్రామప్రయత్న వేషములతో కృష్ణార్జునులు ప్రక్కనని లువఁబడి యుందురు అభిమన్యుడు శయ్యపై నుండును. పాదములకడ ఉత్తర విసరుచు ప్రక్కన సుభద్ర ప్ర॥]

అర్జు—బాబూ! ఇంతగాయమైన నీకుగాని సుమిత్రునకుగాని కాన్పింపనేలేదా —అత్యల్పమగు నీయాఘాతము గలుగకుండ రక్షించుకొననే లేకపోతిరా

అభి— ఆవీరావేశమున నొక్కరికైన గన్నులు కనబడినవా చెవులు వినబడినవా ఎంతసేపును పారిపోవు కౌరవుల వెనువెంటఁ బడిసంహరించుటకే యభిలాష గలిగెను గాని—

అర్జు—అట్లుసంహరించినను ఎంతో యానందించియుందుమేమో

కృ— అర్జునా! నీవుసయితమభిమన్యుని వలెనే మాటలాడెద వేమి

గీ. దుస్ససేనునిఁ జంపి నెత్తురులు ద్రావ
గదను రారాజు నూరు భగ్నంబుసేయ
సూతసూతిని యుద్ధనిపాతుఁ జేయ
మీరుదాల్చినప్రతిన లేనీరుజేర ?

అభిమన్యుడు కౌరవులను చంపగలడే యనుకొమ్ము అంతమాత్రమున మీప్రతిన లుపసంహరింపబడునా కాక- శవసిరంబుల నేమైన —మరిమొకసారి వధించి పాండునందనులు నిర్వర్తితప్రతిజ్ఞులు కాదలంచితిరా

అభి—మామగారూ!— మాతండ్రుల ప్రతిజ్ఞలను సర్వజ్ఞులరగు మీరునిలుపదలంచిరో యనునట్లు —సమయమునకుమీ

యాజ్ఞావాక్యములు వినంబడినవి. వాని నతిక్రమింపఁజాలక వెంటనే వచ్చితిని.

సుభ—నాయనా ! నీవు వచ్చుటయే మేలైనది!—కానిచో చేతిపై నింతగాయమైనప్పుడు దుష్టులగు గౌరవులతోడ జరుగు సంగరమున నెటుపోయి యెటువచ్చునదియు నెవ్వరెఱుంగుదురు అపాయమును గుఱుతించి- ముందుగా మేల్కొనుటయే బుద్ధికి లక్షణము.

అర్జు—అంతయును బావగారి కృపాకటాక్షమూలకమే...... బాబూ వైద్యుఁడు చేయి పరీక్షించినాఁడా?

అభి—ఆఁ—ఇప్పుడే చూచివెళ్ళెను.

అర్జు—అతని యుద్దేశ మేమని.

అభి—చేతిపైనున్నగాయము సంపూర్ణముగ నయమగు దనుక కదలుట క్షేమముగా దని పలికెను.

అర్జు—దేవీ ! వింటివా ?

చ! అని యొనరింప నొండొరు సహాయముఁ గోరఁడు బాలకుండు, దిగ్గున చెవిసోకు లే తడవుగాఁ బరువెత్తు; దురాత్ములానుఁ దుల్
రణమున గాయమయ్యె బహురక్షణ గోరెడు వేళసున్మునే
పనిగొనియుంటి సంగర మవశ్యము సల్పగ నీదె భారమా.

ఆ. వైద్యరక్షణంబు పరిపూర్ణ మైనను
నేను వచ్చుదనుక నీకుమారు
ననికి నెట్టివిషయమునం దైనఁ బంపగా
వలదు; బాలు డెట్లు పలుకుచున్న.

సుభ—మీరును తగినంత శీఘ్రముగా మరలిరావలయును.

అర్జు—సంశప్తకులతో రణము పరిపూర్ణమైనంతనే—బాబుశరీర స్థితిని చూచుటకైన నొక్కమాఱు వచ్చెదను.

అభి—బాబయ్యగారూ! నావిషయమై మీ రేల బెంగబెట్టుకొనియె దరు: మీ కేమియు చింతనంద నవసరములేదు

ఉ. కౌరవయోధులెల్ల ననుఁగాంచి భళీ యభిమన్యుఁ డందు దో
ర్వీరునిగా స్తుతింప, దన పేరినిఁ దండ్రికి పేరుదెచ్చె నౌ
రౌర! యితండు పార్థసుతుఁడా! శివసూతియ! యంచు మెచ్చగా
పోరఁ జరింపనే గురుఁడపూర్వముదా వహామానసుండుగన్.

అర్జు—(నవ్వి) నాయనా! నీవంతటివాఁడవే యగుదువు కాని. నా ల్గువాళ్ళు నామాటపై నోపికపట్టియుండుము—పిదప రణ మాచరింప నెన్ని నాళ్ళులేవు:

గీ. ఈరణం బెంతమందిమారణంబు
సలుపకుండగ నెందరు శౌర్యధనుల
పుత్రశోకమహాంబుధి ముంచకుండ
వదలగల దిట్టి తొందఱవలదు కుఱ్ఱ!

కృష్ణు—(స్వగ) కుమారుని విడిచిపోలేక పోలేక పోవు పార్థునినోట నా యీాయశ్లీలము! ముం దేమిజరుగునో?

(తెరలో)

మహాత్ములారా! పార్థకృష్ణులారా! భద్రాశ్వసంశోభితమగు తేనరథ మాయత్తమైయున్నది.—పురోహితులు శుభకాల మైనదని నుడువుచున్నారు.

అర్జు—భద్రుడా! ఇదె వచ్చితిమి. బావా! బయలుదేరుదమా?

కృష్ణు—నీ యప్పగింత లన్నియు నైనచో—నాబయలుదేరుట యి దివఱకేయైనది.

అర్జు—నా యప్పగింత లింకేమియును లేవు—దేవీ! బాబు జాగ్రత్త!
బాబూ!—సాహసముం జూపఁబోకుము.

(2 అనుబంధము.)

సుభ—చిత్తము.

అభి—చిత్తము...... బాబయ్యగారూ ! నమస్కారము—మామగారూ! వందనము.

ఇద్దరు—ఆరోగ్యమస్తు—(రెండడుగులు నడచి)

అర్జు—(వెనుకకువచ్చి) ఇదిగో ! మరియొకమాట—మాపెద్దన్నగారు, నాయుద్దేశమెఱుంగక, బాబు నొకవేళ రణమునకంపెదరేమో—వలదని నేనంటినని చెప్పవలెను.

కృష్ణు—పార్థా ఏమినీవెఱ్ఱి! ఆయనమాత్రమెఱుంగనివాఁడా ప్రయాణకాలమున మరల వెనుకకువచ్చుట శుభావహముకాదు రమ్ము—ముహూర్తము దాఁటుచున్నది.

అర్జు—బావా! ఇదె వచ్చితిని.

(ఇరువురు నిష్క్రమింతురు.)

(ప్రథమాంకము.)





శ్రీరస్తు.

# పద్మవ్యూహము.

## ద్వితీయాంకము.



కౌరవ సభాభవనము.

[ప్ర॥ దుర్యో, దుశ్శా, కర్ణ, శకుని, అశ్వ, కృపులు]

దుర్యో—సభాసదులారా!

అ. మనపితామహులును ఘనశరతల్పంబు
జేరు టరసి మిగుల శ్రేష్ఠుడంచుఁ
దలఁచి కుంభభవుని నిలపితిమిగద సే
నానిగాఁగ—దర్శనంబులేదె?.

నిన్నటి యభిమన్యుని రణవిజృంభణసమయమున నయితే మాయన యొకభాగముననను—మన మొకభాగముననూ—నుండుటచేత నే బాలకునిచే పరాభవము పాలుగావలసివచ్చెను. నేడు కూడ—

చ. దురమున లేఁడు పార్థుఁ డతిదోర్బలుఁ డాయభిమన్యు బాలుఁడా
కరమునఁ గల్గు గాయమున, గాసిలి తల్పమునందుఁ జేరె త
క్కురు మనయోధులం గెలువఁగూడిన శూరులుగారు, గాన నే
డరమరలేక పాండవుల నంతఱి గెల్వఁగనౌను, ధీరతన్.

కర్ణు—పాత్రాపాత్రల విమర్శింపక—సేనాధిపత్యము లిచ్చిన దోష
ము మనదిగాని, స్వీకృతులది కాదు—అదేమి పాపమో కాని,

గీ. కౌరవుల తిండి యని పల్కఁగానె యుద్ధి
యేల విషమయిపోవునో యెఱుఁగరాదు;)
కలరుగా యట్టిఘను లనేకులు ధరిత్రి
తరలెఁగా యట్టిఘనులలో ఆతఁడొకఁడు.

కృపు—కర్ణా! కౌరవుల తిండియన్న విషమగు ఘనులు కలరని, యె
త్తిపొడుచుచున్నావు—అందు చచ్చిన పితామహుని బహిరంగ
ముగఁ బేర్కొనుచుంటివి. ఇట్టి యవాచ్యమగు ప్రేలాపనము
నీకు తగదుసుమా! కురునాథుని మనస్సున కహితంబులైన
నను ఆతని హితంబుఁ గోరియే పల్కుచుండుముగాని! తేర
తిండి తలకెక్కి విషమైనందువలనఁ గాదుసుమా! అభిమా
నంబుననే, కురురాజును మే మాశ్రయింపవలసి వచ్చెనుగాని
మమ్ముఁబోషించుదాతలు లేక—లోకము గొడ్డుపోవుటంగాదు
ఇంతమాత్రమునకు నీవు తారతమ్యముగాని. మర్యాదగాని
యెఱుంగక—నెల్లిదముగా మాటలాడుట నీమాటకేమిగా
ని—యిట్టి క్లిష్టకాలమున—పదిమందిని సఖ్యపఱచుకొని
కూడఁగట్టుకొనదగిన సమయమున, కురురాజునకు మిగు
ప్రమాదహేతువు—ఇట్టి పుల్లవిఱుపుమాటలచే తుదకు నీవు

మిత్రులనందఱను శత్రువులుగా మార్చఁదలంచినట్లున్నా వు—పదిదినము లఖండసంగ్రామం బాచరించి స్వేచ్ఛామరణ ము నందనున్న పవిత్రుఁడగు భీష్మునిదూషించ సూతపుత్రుఁ డ వగునీవా తగినవాఁడవు? నిన్న క్షణములో శాపగ్రస్తుని జేసిన పరశురాముని గెలిచిన వీరాగ్రేసరుఁడెవ్వఁడు? భీష్ముఁడు కాఁడా!—దుర్యోధనుఁ డిచ్చిన యంగరాజ్యలోభ మాత్రము ననే, నీకన్నులు నెత్తికివచ్చి పెద్దలను సయితము యిదియుక్తమిది యయుక్తమని యెఱుగకుండ భాషింప సిద్ధమైతివా?—కురు రాజుతిండి మామాట యటుంచుము—తోలుత నీకు విమ మైనట్లున్నది.

గీ, హీనకులమునఁ బుట్టినవాని నిన్ను
నెత్తిపై నిడుకొన్నట్టి నింద్యబుద్ధి
నిజము దుర్యోధనుని దగు నీదిగాదు;
బొమ్మరాతిని శివలింగముగ నొనర్చె.

కర్ణు—పది దినంబులు యుద్ధంబొనరించుటవలన భీష్మసేనాధి పత్య మునకుఁ గాలహరణమేతప్ప—ఫలితమేమైనఁ గలిగెనా? నన్ను శపించిన పరశురాము నీభీష్ముఁ డోడించెనని యాపృతా పస్తోత్రము! ఈశాపముల కేమి లెండు- ఇట్టిశాపములు పిన్న నాటగోలె నాతలవెండ్రుకలన్ని యున్నవి!—అవి యన్ని యును నిజమైనచో—నేనింత వఱకు బలహీనుఁడనగుట యు ట్లుంచుఁడు—తోలుత బ్రతికియుందునా?

అశ్వ—ఓరీ! దురహంకారదుగ్విదగ్ధ! రాధాగర్భభారభూత! సూతకు లాధమ! కర్ణా! ఏమిరా మర్యాద నతిక్రమించి పేలెదవు?

చ. కురుకులవృద్ధునిన్, విమతకుంజరసింహుని, బ్రహ్మచారి, నా
దరణవిహీనతన్ ఖలవిధంబునఁ, జచ్చిన వెన్క సర్వభూ
వరులు వినంగ దారుణపుఁబల్కులనాడఁగ బాడియౌనె? నీ
గురుతరపాపవాక్కు వినఁగూడదు, సూతకులప్రమత్తుఁడా!

దుర్యో—(స్వగ) ఓహో! కర్ణాశ్వత్థామ లెచ్చటనున్నను అన్యోన్య వాక్కలహములు శాంతించునాశ లేదు కాబోలును!

కర్ణ—ఓవృథా పరిపంథి గుణస్తోత్రపారీణ! బ్రాహ్మణ వంశార్ణవ బడబానల! గురుపుత్ర! భీష్ముని రవంత యోనాడినంతనే, మామయు నల్లుఁడునుఁ గలసి కలహమునకు కాలుద్రవ్వితిరి గాని, ముం దీమాటకుఁ బ్రత్యుత్తర మిందు.

గీ. పరశురాము నెదిర్చిన బాహుశాలి
యనుచు స్తుతియించితిరి గదా ఘనులవోలె
అట్టి భీష్ముఁడె తనమనసార దలచి
సంగర మొనర్పనిలచునే శత్రుకులము.

గీ. బ్రాహ్మణులతోడఁ గూడి యాబ్రహ్మచారి
సయిత మానాటి కానాడు శత్రుపక్షు
మూని వాదించుటయె కాక, యుద్ధమందు
కోరి గుట్టిచ్చి తాత మాకొంప దీసె!

అశ్వ—తాతయు, బ్రాహ్మణులును మీకొంపదీసిరా!—మీకొంప యనుమాట కర్థమేలేదు. సరి దాని నట్లుండనిమ్ము—బ్రాహ్మణజనాపరాధముగాని, పాండవపక్షపాతాభిమానము లేని నీ వేవిధమున కురురాజు కొంప దీయక నిలువఁబెట్టినది! యీవిధములగు కేవల ముఖస్తోత్రములచేత మంత్రమే కాదా

ఉ. నిన్నటియుద్ధమం దిటులె నీతులు పల్కితి వీవు, ధీరుఁడౌ
నన్నరసూతికై వడకి యట్టె భయంపడి పారినావు నీ
కన్న మహోపకారి యిఁకఁ గల్గునె కౌరవరాజు కోరినన్
తిన్నగృహంపువంకలను దీర్చితి వీవు మహోపకారివై.

సెబాసు? నీపరితాపము నిన్నఁగదా కనుపఱచితివి!

చ. తలముడి జారఁగా నొకఁడు ధైర్యముజారగ నింకొకండు మేల్
వలువలుజార వేరొకఁడు వంచినశీర్షము లెత్తకుండఁగా
లొక్కాలఁదిని బారిపోయి రనిలో మనకౌరవయోధు లెల్లరుం
దెలిసికొనంగలేదె తమ ధీరత శూరత యంద రాత్మలన్.

గీ. ఇప్పటికి మించలేదు మఱెప్పుడైనఁ
పార్థపుత్త్రునిపాలిటఁ బడకపోరు
నాటిపందుగ కడకంట బాటిరేని
బ్రిదుకు గందురు మీకయి పార్థుఁ డేల?

కర్ణు—మేము శౌర్యమున నభిమన్యున కొక్కనా డోడి పారినమాట కేమిగాని, నీవొక్కరు డవుమాత్రి మాతని జయించినట్లు మాటలాడుచుంటివే!

కృపు—కర్ణా! మేము జయమందను లేదు—నీవలె జయింతు మను పరితాపములు పలుకను లేదు.

కర్ణు—తథాస్తు చిరకాల మట్లే యగుఁగాక!

గీ. అనిని వేళావిశేషము ననుసరించి
జనము లొక్కొకసమయాన జయముగాంతు,

రంతమాత్రముచేస్తుతి కర్హుఁ డగునె?
అతని కోడినయెడల నింద్యార్హుఁ డగునె?

అశ్వ—ఏమిరా! శూద్రచండాలా! మాయోటమిని చిరకాలము ఘోరపరచి సత్యవాగ్బద్ధునివలె దీవించుచుంటివా! —మేము చిరకాలము పరాజితుల మగుటకు శాపకుంచితులము కాము రా!

చ. అలయక విద్యఁజెప్పిన మహాత్ముని వంచనఁ జేసినారమో
బలమున కన్నుగానక యపాత్రతవిప్రులఁ దిట్టినారమో
తెలిసియు సర్వమున్ పలుకుతీపిని భూపుని ముంచినారమో
కలుషమతీ! యవాచ్యములు కన్నులుమూసి వచింతు వేమిరా?

కర్ణ—(క్రోధమున) ఓరీబ్రాహ్మణాధమా! నిరంకుశవాగ్విజృంభణా యవమానివగు నీకుశస్త్రములతోగాని బుద్ధిచెప్పుటకు వీలు లేదు.

గీ. పార్థుఁడో పార్థసూతియో వచ్చి నన్ను
సదమదించుటో! నే వారి జంపుటయొ ని
జంబొ యనృతంబొ యాపయి జరుగగలదు
గాని నీచావిపుడె గల్గు కాచుకొమ్ము.

(కత్తినెత్తును.)

దుర్యో—(పట్టుకొని) మిత్రుడా! శాంతింపుము. ఇదియా మనలో మనము కలహించుసమయము.

అశ్వ—రారాజా! అతనిని వారింపకుము. రానిమ్ము. నేడు వీనికిఁ గాలము చెల్లెను. ఈయొక్కఁడు నశించెనో నీయదృష్టచక్రము తిరుగఁగలదు. ఓరీ సుతాధమా!

గీ. అధముఁడా! నీవురా నన్ను హాతము సేయు
నట్టి బంటవు—నీమదమాఁ రెనిపుడె
చూడరా! బ్రహ్మవిద్వేషి ! శుభదకాంతి
విస్ఫుటంబగు నాదు గంభీరశరము.

(కత్తిదూయును.)

కృపు—(పట్టుకొని) అబ్బాయీ! ఇన్ని నాళ్ళను నమ్మి వర్తించినవారము—సమయమునకు మనము దుర్యశము పాలుకాఁగూడదు—మన కీతనితో పనియేమి? కురురాజు మొగము చూచి యూరకుండుము—నామాట వినుము.

అశ్వ—మామా! నీవనినట్లు కురురాజు మొగము చూచియే మూరాడకుందును. అందులకుఁ గురురాజైన నాతని రవంత మందలింపవలయును గదా ! చూతము— (దుర్యోధనుని జూచి) ఓ రాజరాజా!

చ. అనుపమవంశమందుదయమందిన మేటివి నీవు-మాయురే!
మన కతినింద్య మీఁఖలుని మైత్రిలభించె నదెట్లు నీకు-నీ
జనన మదేడ ? యీయధమజాతుఁడిపుట్టక యేడ ? వీని నే
మనుటకు నోరురాని యధమాధమదుస్థితి యేల భూవరా ?
వీనిని నీవు రవంతైన మందలింపఁజాలవా ?

దుర్యో—ద్రోణాయనీ ! నేను నిన్నెట్లు మందలింపఁజాలనో అతనిని నయితమట్లే మందలింపఁజాలను సుమా ! నాకిద్దరును సమానులే !-మీలో మీరే కయ్యమనిన కడుపునిండునట్లు డీకొనుచు - తత్ఫలమును నాపై వేయుచున్నారు. ఇంతటితో శాంతించి-యిరువురు- హితమతులై ప్రవర్తించుట లెస్స.

అశ్వ—అట్లయిన నిదే నాప్రతిజ్ఞను మీరందఱు నాలకింపుఁడు.

ఆ. రణతలంబునందు రాధాసుతుఁడు కూలు
నంతదనుక ముట్ట నస్త్ర మేను-
ప్రతినదప్పియున్న పరమేశ్వరునిపాద
పద్మములకు దప్పువాఁడ నౌదు.

(అనుబంధము 3)

(శస్త్రమును విడిచి చనును.)

కృపా—బాలకా! ఏమి యీ వెర్రి—పూర్వ మెవ్వఁడో తటాకముపై నలిగి యేమో చేసెనట! నీకథ యట్లున్నది.

అశ్వ——మామా! నామత యింక మరలదు—నన్ను మందలింపకుము—(పోఁబోవును)

కృపా—తాళుము—నీతండ్రిగారు వచ్చువఱకైన—

అశ్వ—(మాటాడకుండ నిష్క్రమించును.)

కర్ణ—ఆచార్యా! అతని నేల నీవాటంకపఱచెదవు!—పోనిమ్ము-ఈ మహాబలుఁడు లేనియెడల మనబలంబు శౌర్యహీనము కాదులెమ్ము

దుర్యో—మిత్రమా! ఇట్టిసమయమునందు మన కందఱిసహాయము లును గావలసినవే! నీవేల నాతనిమనస్సు నవసరముగ నొప్పించెదవు?

(తెరలో)

మహారాజా! సేనాధిపతులగు ద్రోణాచార్యులవారరుదెంచిరి

దుర్యో—ఆచార్యులుకూడ నరుదెంచిరి మనసభ యించుకశాంతి నభినయించిన బాగుండును.

కర్ణు— అశాంతిహేతుభూతుండగు వ్యక్తి యీవలకే నడిచెనుగదా! ఇకశాంతి కేమికొదువ

(ద్రోణుఁడు సేనానివేషముతో.)

ద్రోణు—జయము!—దుర్యోధనమహారాజా! జయము!!

అందరు—జయ్! సేనానాధద్రోణాచార్యునకు-జయ్!!

ద్రోణు—(కర్ణునిఁజూచి) నేడేమో కర్ణుని మొగము ధుమధుమ లాడుచున్నది! (రెండవంకఁ జూచి) ఏడీ! మామయబ్బాయికన బడఁడే!

దుర్యో—కర్ణాశ్వత్థామల కలహములు మీరెఱిఁగినవి కావుగదా! నేడది రవంత వ్యతిరేకించెను—అందు మీనందనుఁ డొకచిన్నప్రతిజ్ఞ చేసెను.

ద్రోణు—కాని ప్రతిజ్ఞావాక్యము లేమని

దుర్యో—ఇట్లు—

ఆ: "రణతలంబునందు రాధాసుతుడు కూలు
సంతదనుక ముట్ట నస్త్ర మేను
ప్రతినఁ దప్పియున్న పరమేశ్వరుని పాద
పద్మములకు దవ్వువాఁడ నౌదు"

ద్రోణు—ఆలోచించి సరే ప్రతిజ్ఞలకేమి తరువాతచూచుకొన

వచ్చున—తొలుత నామాటను సావధానచిత్తులై సర్వజ్ఞు లాలకింపుఁడు.

దుర్యో—ఆజ్ఞానువర్తులము.

ద్రోణు—

గీ. పార్థుఁ డరిగె సంశప్తక భండనంబు
సలుపఁగా నేఁడు తత్కుమారుఁడు గలండు
తమ్మిమొగ్గరము సృజింప దానఁబడి మృ
తిం గనును పార్థసూనుఁడు తెలివిమాలి.

దుర్యో—అట్లేల సంభవించును ? ఇందలి రహస్య మేమి ?

ద్రోణు—పద్మవ్యూహంబుఁ జొచ్చుటయు—మరల వెలువడుటయు ను రెండువిద్యలును నేర్చినవాఁ డొక్క పార్థుఁడు మాత్రమే—అభిమన్యుఁ డందుఁ జొచ్చుటయే కాని వెడలు టెఱుంగఁడు.

దుర్యో—అట్టివానిని పంపుదురా సంగరమునకు ?

ద్రోణు—అందుల కొక యుక్తిపన్నితి నాలకింపుఁడు—పొద్దుగ్రుంకకుండ నేను ధర్మజునిఁ బట్టి తెచ్చి కురురాజు పాదములందు నుంచెదనని, ప్రతిన గావింతును. దానిని విని ధర్మదేవుఁడు భీతచిత్తుఁడై భీమాదులను సహాయముగా నైనఁబంపి, యభిమన్యుని బలాత్కరించి పద్మవ్యూహ భేదనమునకై పంపును. అభిమన్యుఁడును వెలువక ప్రయాణ మగును. అట్టిసమయ మరసి యాతనిని పద్మవ్యూహమునం దిరికింపి—వేటకాడు

మృగమును వేటాడిచంపినట్లు చంపవచ్చును. నాకు పద్మవ్యూహనిర్మాణమును కధికారమిచ్చి పంపుము.

దుర్యో:— మీ ప్రయత్నము నిర్విఘ్నముగఁ గొనసాగుఁగాక!

(పుష్పహారము వేయును.)

అందరు—(కరతాళములతో) జయ్! సేనాధినాథద్రోణాచార్యునకు జయ్!!

(తెర వ్రాలును)

ఇది ద్వితీయాంకము.



ప్రదర్శనానుకూలము !! చక్కనిప్లాటు !!!

# దానవీరకర్ణ

కర్త,

సోమరాజు రామానుజరావు.

చదివినకొలది చదువవలెనని యుత్సాహముగల్గించు యీనాటకము

వెల 1—0—0

శ్రీరామకృష్ణ బుక్కు డిపో, ఏలూరు.





శ్రీరస్తు.

# పద్మవ్యూహము.

## తృతీయాంకము.

పాండవ శిబిరము.

(ప్రి॥ ధర్మరాజు—ఒంటరిగ.)

ధర్మ—(స్వగతము)

ఉ. తమ్ముఁడు బావయుం గలసి దారుణయుద్ధము నిందువీడి, యా
లమ్మొనరింప నేగిరి చలంబున యాదవసేనపైకి శీ
ఘ్రమ్ముగ నట్టికీ లెఱిఁగి కైతవముం బొనరించి ద్రోణుఁడీ
యమ్మున వ్యూహ మొండు రచియించెను దీనివిభేద మెట్లొకో!

ఇదికాక—

ఉ. భానుఁడు గ్రుంగకుండగనె పట్టెద ధర్మజు; నంతఁబోక భూ
జానిపదంబులం దునిచి సంతసమందఁగఁ జేతునంచు నా
పైని దురంతమైన పగఁబట్టెను ద్రోణుఁడటంచు వింటి, నా
ప్రాణికి నేమిగాని, యిక పాండవులన్న నలంతియౌఁగదా!

యుద్ధవార్తావహుండగు కరండకుఁ డింకను రాలేదేమి చెపుమా !!—
అదిగో ! ఆ వచ్చునది వాఁడే కాఁబోలును.

(కరండకుఁడు ప్రవేశము.)

కరం.—జయము మహారాజా !

ధర్మ—కరండకా! యుద్ధవిశేషము లేమి ?

కర.—మహారాజా! అవధరింపుఁడు—అపరాహ్ణ మగునంతకుఁ బూర్వముగ తమ్ముఁబట్టి బంధించి రారాజు పాదసమీపమునం దుంచెదనని ప్రతిజ్ఞావాక్యము లాడుచు కుంభసంభవుడు మధ్యందినమార్తాండుని చందమున వెలుగుచు—ఈతఁడీదినమున సర్వపాండవసేనాసముదయమును సంహరించునో యను సందియమునంది గగనభాగంబునం దంతటను సమాక్రమించిన యనిమిషు లనిమిషులై విమానమధ్యస్థలంబుల నిలచి, కిందికిఁ జూచుచు "భళీ—బాపురే—వహ్వారే—హారిహారీ—చచ్చెచచ్చె—కటకటా—" యను వివిధహృదయభావార్థబోధకంబులగు స్తుతివాక్యములతో, సీత్కారములతో, మెప్పులతో—పెదవివిఱుపులతో సంకులసమారంభులై యుండిరి. అట్టి మహాకల్లోలవేళ ద్రోణుండు కౌరవవాహినీ మధ్యంబున నిలచి కురుసేనలను—పద్మాకృతిగా నిలిపి—వారితోడ, పద్మవ్యూహమను పేరుగల యొక వ్యూహంబు నిర్మించి—సేనానికరమధ్యంబునకు శత్రువు లరుగని విధంబునఁ గట్టుదిట్టము చేసెను.

ధర్మ—తరువాత—తరువాత—

కరం—తరువాత నో దేవా! ద్రోణుం డవారితగర్వోత్సాహ తాంతః కరణుఁడై—దివ్యాలంకార సహితంబగు నొక్క దివ్యాశ్వము నారోహించి—ప్రతివ్యూహముం గలయఁదిరుగుచు వ్యూహ చతుష్కోణంబులందును—మహారథులగు దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకునులను నల్వురను నిలిపి యుభయసేనా వారంబులును విస్పష్టముగ నాలకించు తెఱంగున, గంభీరముగు కంఠంబువిప్పి—"యోధులారా! సేనలారా! మీలో నసమర్థులగువా రున్నచో, సాయంతనములోన ధర్మజుం బట్టితెచ్చి రారాజు పాదపద్మంబులకడ నుంతును. ఇది నా ఘోరప్రతిజ్ఞ యని యుధిష్ఠిరున కెఱిగింపుఁడు." అనియట్టహాసము చేయుచుండెను. వ్యూహభేదనంబునకై మన సేనలనుండి యొక్కరును బయల్వెడలకుండుటచే కురుసేనలన్నియుఁ గన్నులు విప్పి మనసేనకే చూచుచు—చెక్కుచెదరక యుండెను. ఈ స్వల్పావకాశంబుననే జరిగినవృత్తాంతమెల్ల దేవరకెఱిగింప వలయునని యిందువచ్చితిని—స్వామీ!

ధర్మ—కరండకా! అట్లయిన మనవారి వృత్తాంత మేమియుఁ దెలుప నేలేదేమి?

కరం—స్వామీ! అవధరింపుఁడు. మనఘటోత్కచకుమారుం డంబరమున కెగసి—వివిధ రాక్షస మాయావిలాసంబులు మెఱయ—రాల రువ్వియు—పిడుగులు గురిపించియు—నుల్కాపాతంబు గావించియు—నిట్లనేక తెఱంగులగు స్వేచ్ఛావిహారంబు లొనర్చుచుండెను. మన భీమసేనుండు వ్యూహవిచ్ఛేదనంబునకు నేర్పుచాలమి—తత్కోణభాగంబులం జేరి—చేతికందిన సేనలఁ దనగదాప్రహారంబుల బాధింపఁ దొర

కొనిరె. సేనాపారంబును వ్యూహనిర్మాణంబు చెదరకుం
డ, మిగులనేర్పుతోడ నొక్కొక్క శిలీముఖంబున భీముని నొప్పిం
చుచుండఁ జూచువారికి తద్రణం బత్యంతచిత్రమై పరిహాసన
గతి నొప్పారెను. నకుల, సహదేవ, సాత్యకి, ధృష్టద్యుమ్న
యుయుత్సాదులు దూరంబుననిలచి, ద్రోణుని రోషపూర్ణ
భాషణంబుల నాలకించుచుఁ జేయునదియేదియో తమలోఁ
దాము సమాలోచించుకొనుచుండిరి.

ధర్మ—ఆహా ! పాండవసేన—నేటికి నిస్తేజమయ్యెనా ?

గీ. విజయకృష్ణులు రణమును విడిచినట్టి
కొఱత, స్పష్టముగా నేఁటి కెఱుకబడియె
నరుఁ డొకం డున్న వ్యూహంబు జెఱుపకున్నె
కృష్ణుఁ డున్న నుపాయంబు నెఱుఁగకున్నె ?

కరండకా ! నీవరిగి భీమాదులను నాయానతిగా నిందు రమ్మ
నుము. పొమ్ము.

కరం—భాగ్యము.

(నిష్క్రమించును.)

ధర్మ—ఈద్రోణసంరంభమంతయు నాలకించినంతనే కృష్ణార్జునుల
సంగతి యెట్లున్నదో యారసి—తద్రణమును సగములోనైన
నరియో, విడిచిరమ్మని తెలుపవలసినదిగా నేనంపిన—యుద్ధ
వార్తాపరిచారకుడగు వేగవంతుఁ డింకను రాలేదు. అతని
రాకచేనైన నాహృదయమునకు శాంతి కలుగఁగలదని తోఁ
చుచున్నది.

(తరువాత వేగవంతుఁడు ప్ర॥)

వేగ — జయము- జయము. మహారాజా!

ధర్మ — వేగవంతా ! రమ్ము నీకొఱకే వేచియుంటిని

వేగ — మహారాజా ? నే నరిగిన కార్యము విఫలమైనదని యెట్లు విన్న
వింతును ?

ధర్మ — వేగవంతా ! నీ వరిగిన కార్య మెట్లు విఫలమయ్యెనో వక్కా-
ణింపుము.

వేగ — మహారాజా ! అవధరింపుము. పదివేవురు సంశప్తకులు గలి
గిన మహాసైన్యముతోడ మనపార్థుఁ డేకమాత్రసహాయుఁడై
రణ మొనర్చుచున్న — వియత్పథంబున కెగురు కళేబరంబులు
న్న-రణతల క్రీడారంభ భూత భేతాళ సంతానంబుల కరంబు
లగ్రీడాకందుకంబులై- చిత్రగతుల నాట్యం బొనరించు
సైనికశిరఃప్రకరంబులును భూనభోమధ్యభాగంబులందు నిబి
డమై నిండుకొని దట్టంపుమేఘావరణంబుభాతి నున్న భూపరా
గంబును, అశ్వఖుర సంఘట్టనంబులచేతను, గజఘీంకారంబుల
చేతను, సైనిక సింహనాదార్భటులచేతను, దశదిశలయందును
నిండిశ్రవణపుటభేదకంబులైన మహాకోలాహలంబువలన రణ
ప్రదేశమంతయుఁ బ్రళయకాలసంజనితంబగు జీవకోటికోలా
హలంబువలెను- దేవదానవ మహాసంగ్రామకాలంబునందలి
సింహగర్జన సదృశంబులగు వీరాధివీరాట్టహాసంబులవలెను
జూపట్టి- వియచ్చరులకు సయితము గగనరంగమున నిలువ
నీడగలుగదయ్యె.

(తరువాత వేగవంతుఁడు ప్ర॥)

వేగ — జయము- జయము. మహారాజా!

ధర్మ — వేగవంతా ! రమ్ము నీకొఱకే వేచియుంటిని

వేగ — మహారాజా ? నే నరిగిన కార్యము విఫలమైనదని యెట్లు విన్న వింతును ?

ధర్మ — వేగవంతా ! నీ వరిగిన కార్య మెట్లు విఫలమయ్యెనో వక్కాణింపుము.

వేగ — మహారాజా ! అవధరింపుము. పదివేవురు సంశప్తకులు గలిగిన మహాసైన్యముతోఁడ మనపార్థుఁ డేకమాత్రసహాయుఁడై రణ మొనర్పుచున్న — వియత్పథంబున కెగురు కళేబరంబులు న్న-రణతల క్రీడారంభ భూత భేతాళ సంతానంబుల కరంబులగ్రీడాకందుకంబులై- చిత్రగతుల నాట్యం బొనరించు సైనికశిరఃప్రకరంబులును భూనభోమధ్యభాగంబులందు నిబిడమై నిండుకొని దట్టంపు మేఘావరణంబుభాతి నున్న భూపరాగంబును, అశ్వఖుర సంఘట్టనంబులచేతను, గజఘీంకారంబులచేతను, సైనిక సింహనాదార్భటులచేతను, దశదిశలయందును నిండిశ్రవణపుటభేదకంబులైన మహాకోలాహలంబువలన రణప్రదేశమంతయుఁ బ్రళయకాలసంజనితంబగు జీవకోటికోలాహలంబువలెను- దేవదానవ మహాసంగ్రామకాలంబునందలి సింహగర్జన సదృశంబులగు వీరాధివీరాట్టహాసంబులవలెను జూపట్టి- వియచ్చరులకు సయితము గగనరంగమున నిలువ నీడగలుగదయ్యె.

ధర్మ— వేగవంతా! మహాధనుర్ధరుండగు తమ్ముని పరితాపం బిట్టిక
నేనెఱుంగకపోలేదు తరువాత వృత్తాంతం బెఱిఁగింపుము.

వేగ—స్వామీ! వచ్చుచున్నాము—అట్టి మహాసంకులంబగు ర
రంగమున, కపికేతనం బొక్కటిమాత్రి మంతరాళమధ్యము
మహావాయుపరిచలితంబై, దృగ్గోచరం బగుచుండెను. ఫల్గు
ణునిరథమందు గలదని మాత్రిమే సూచింపఁబడుచుండె
గాని, రథస్థుండగు పార్థుండు గాని, సారథి య
కృష్ణుండుగాని, యెవ్వరికిని గాన్పింపరైరి. రణాంతరమునుం
యొక్కధ్వనియైన బయటకువచ్చుటకుఁ గాని, బయటనుం
వృత్తాంతము లోపలివారి కందుటకుఁ గాని వీలుగలేక
అటుపిమ్మట, చేతనైనన్ని ప్రయత్నము లొనరించియు వి
విఫలమనోరథుండనై—తమ కీప్రియోజకవార్త తెలిం
పవచ్చితినిస్వామీ!

ధర్మ—వేగవంతా! మాకాలము సరిగా లేనప్పుడు—నీ వేమి చేయ
గలవు? నీపని పైఁబొమ్ము.

వేగ—భాగ్యము. (నిష్క్రమించును.)

ధర్మ—(స్వగ) ఏమియిది? కాల మిట్టివిపరీతగతి నందినది!

చ. ఒకదెస కుంభసంభవుఁడు యుద్ధమునన్ ననుఁ బట్టనెంచె, వే
 రొకదెస నీరజాతఘనవ్యూహము సిద్ధముగాఁగ నుండె నిం
 కొకదెస పార్థకృష్ణులు మహోగ్రరణం బటుసలుపుచుండి రిం
 కకటకటా? మరేదిగతి? యాహవమం దిఁక నేనొనర్పఁగన్.

అల్లదె-భీమాదులు వచ్చుచున్నారు. వారితో మంతనం బొనర్చి-
యర్హవిధాన మాలోచించెదఁగాక.

[భీమ, నకుల, సహదేవ, సాత్యకులు, ప్రవేసింతురు.]

భీమ—నకులసహదేవసాత్యకులారా మనయుధిష్ఠిరమహారాజు పదనారవిందములను వీక్షించుడు— నేడెంత చిన్నబోయియున్న

దో—చూచితిరా

గీ కుంభసంభవు డనిలోన ఘోరముగను
బట్టిరారాజు ఘనపాద పద్మములను
దన్నుఁబడవేతు ననుమాటవిన్నపిదప
చల్లనైయున్న గుండెలుజల్లుమనియె

ఈయననింతుక సమాశ్వాసించుట మనకు యుక్తము. పోవుదమురండు.

(అందరునుపక్రమింతురు)

అందరు— మహాత్మా శమననందనా నమస్కారము

ధర్మ—వత్సలారా ఇటువచ్చికూర్చుండుడు— మీరాయిందరి రాకచే హృదయము పరమానంద పూర్ణముగా నున్నది—నామనో వ్యాకులము తీర—నాకిప్పట్టున సదుపదేశం బొనరింపుడు.

భీమ—అన్నయ్యా! మన మిప్పుడొక్క పద్మవ్యూహముభేదింప బను మార్గము నన్వేషించితిమేని కుంభసంభవుడు తదగ్రింబున మునింగియుండి మీదనుకరాజాలఁడు

ధర్మ—ఔను— అట్టియుపాయమేకదా కావలసినది!

భీము— మన యభిమన్యునకు పద్యవ్యూహ భేదనము తెలియునని యొకమారుపార్థుడే నాతోవచించెను

ధర్మ—ఔను — నేనుసయితము మీమాట వినియుంటిని ।
యందొకదుస్తరప్రమాదము గలదుగదా

భీము—అట్టిప్రమాద మేది

ధర్మ— అభిమన్యున కందు ప్రవేసించుటయే కాని బయల్వెడ
యదనివింటిని.

భీము— అంతమాత్రమున—మీకుభీతి యేల

ధర్మ— భీతి గా కేమి చేతిపై గాయము తగిలియుండి కదులజా
పద్మవ్యూహ భేదనమును సయితమెరుంగని బాలు
మునకు బంపుటయెట్లు

గీ చెవిని పలుమారు వలదని చెప్పి చెప్పి
మరల మరల దెల్పినను నామాటవినక
ప్రాణలోభమునను ధర్మరాజు బాలు
నొక్కనిం బంపె ననుకొన డొక్క నరుడు

అందు రవ్వంత యపాయమే సంభవించెనేని యిక చెప్పె

భీము—అట్టిభీతి మీ కెంతమాత్రమును వలదు

చ. మొదలురవంత బాలకుడు వ్యూహముఖంబునుచించెనేని య
కదనము సల్పగా నొరులు కావలెనే శమనాత్మజాత! మే
మదనున కండుజేరి కవ లాపయి నేనుముకుంద సోదరుం
డదయుల హామ శాత్రవులపంద ల జిందర సేయకుందు మే

ఆ. భుజమునందు గదనుబూని రిపులపిండి
సేయుటొకటెగాని చెలగియిట్టి
వ్యూహరచనములను యుద్ధపు యుక్తులు
నేనెరుంగజాల నిశ్చయముగ.

ధర్మ— ఔను — నేనుసయితమీ మాట వినియుంటిని కాని — యందొకదుస్తరప్రమాదము గలదుగదా

భీము— అట్టిప్రమాద మేది

ధర్మ— అభిమన్యున కందు ప్రవేసించుటయే కాని బయల్వడుట తెలియదనివింటిని.

భీము— అంతమాత్రమున — మీకుభీతి యేల

ధర్మ— భీతిగా కేమి చేతిపై గాయము తగిలియుండి కదులజాలక — పద్మవ్యూహ భేదనమును సయితమెరుంగని బాలుని రణమునకు బంపుటయెట్లు

గీ చెవిని పలుమారు వలదని చెప్పి చెప్పి
మరల మరల దెల్పినను నామాటవినక
ప్రాణలోభమునను ధర్మరాజు బాలు
నొక్కనిం బంపె ననుకొన డొక్కొ నరుడు

అందు రవ్వంత యపాయమే సంభవించెనేని యికఁ చెప్పెడిదేమి

భీము— అట్టిభీతి మీకెంతమాత్రమును వలదు

చ. మొదలురవంత బాలకుడు వ్యూహముఖంబునుచించెనేని యీ
కదనము నల్పగా నొరులు కావలెనే శమనాత్మజాత! మే
మదనున కందుఁజేరి కవ లాపయి నేనుముకుంద సోదరుం
డదయుల మా చు శాత్రవులపంద ల జిందర సేయకుందుమే

ఆ. భుజమునందు గదనుబూని రిపులపిండి
సేయుటొకటెగాని చెలగియిట్టి
వ్యూహరచనములను యుద్ధపు యుక్తులు
నేనెరుంగజాల నిశ్చయముగ.

ధర్మ—భీమన్నా ! నీవుచెప్పినది యుక్తముగానే యున్నది గాని—
నాహృదయమేమో సంశయాకులమై, చొలివ గల్గుటలేదు

భీమ—అన్నయ్యా ! మీ కేటికీ నిరర్థకసంశయము!- బాబుప్రాణ
ములు నీకొకటియు- నాకొకటియునా? ఏదైననపాయము రా
నేకూడదుగాని వచ్చినచో - నీకొకనిందయు. నాకొకనిందయు
వచ్చునా?

గీ. కాచియుందుము నాల్గువంకలును మేము
వ్యూహమున బాబు మొనసుంత యూపెనేని
సైనికని కాయులముల నెల్ల సదమదించి
క్షేమముగ బాబు నీవల జేర్తుమయ్య.

గీ. బాబునకు సుంతయైనను ప్రాణహాని
గాని మనపార్థునకు సుంతగ్లానిగాని
కలుగకుండగను సిగపూవుగాగి పార్థ
తనయు బయటకు దెత్తుమో ధర్మతనయ.

ధర్మ—బాబు చేయియెట్లున్నదో - మీలో నెవ్వరైన జూచితిరా?

భీమ—ఇచ్చటికివచ్చెడు మార్గమధ్యమున—బాబు కటకుటీరమున
రెవంతసేపు- మేమందఱమును- నిలచి పరామర్శించియే వచ్చి
తిమి. వైద్యులు తగినశ్రద్ధయందున్నారు వారుచెప్పిన దే
మనఁగా- గాయము మానుదలకు వచ్చినది ఇక నేమియును
భయములేదు ఐనను- మరిరెండునాళ్ళు విశ్రాంతి గైకొనుట
యే ఉత్తమమైనపని యని,

ధర్మ—వైద్యులట్లు చెప్పుచున్నప్పుడు మనమిట్లు చేయవచ్చునా?

భీము—వైద్యులు జాగ్రత్తకొఱకు- మాసినప్పుడైనను మరిరెండు నాళ్లు విశ్రాంతిగైకొమ్మని చెప్పుదురు వారిమాటలొక పాడి గాదు మేము కన్నులార బాబునుజూచియే వచ్చితిమి దివ్యమైన యారోగ్యముతో దేదీప్యమానముగ పలుకుచున్నాఁడు.

ధర్మ—నకులసహదేవులారా ! బాబును నేను చూడఁదలంచితినని చెప్పి యొకమాఱు పిలుచుకొని రాఁగలరా!

ఇద్దఱు—భాగ్యము (నిష్క్రమింతురు)

ధర్మ—భీమన్నా ! అట్లయిన బాబుచెవి నీమాట వైచితిమి

భీము—బాబే నాచెవి నీమాట వేసినాఁడు

ధర్మ—ఏమినియెను?

భీము—మేమచటి కరిగి "నీదేహస్థితి యెట్లున్న"దని యడుగగా-కావలసినంత చిరచిరలాడుచు "ఈసమయమున మీరు విచారింపవలసినది నాదేహస్థితి కాదు- మనమంద ఱమునుగలసి యిప్పుడు పెదతండ్రిగారి శుభమునుగదా కోరవలసినది మీ రింకను కుంభసంభవుని ఘోరప్రతిజ్ఞను వినలేదా యేమి?"అని ప్రశ్నించెను అప్పుడు నేను - తగువిధముగా క్షమ్మకొనదలంచి బాబూ! మేము విని యేమిచేయుదుము! నీశరీరమున తిన్నఁగానున్నచో పెదతండ్రిగారి కేమిభయము? కావున, నీ యారోగ్యమును తొలుత విచారించుటకే వచ్చితి" మని పలికితిని. అంతట బాబు వైద్యరక్షణమందున్న చేతి నవలీలగా నూపుచు "నేను సంపూర్ణారోగ్యశాలినై యున్నాను ఒక వేళ తేకున్నను వెనుదీయుదునా?

చ. తనపనివచ్చినప్పుడు వృథాయొనరింపక కార్యకర్మకుం
బనివినినట్టియాతఁడె కుమారుఁడుగా కితరుండు పుత్త్రుఁడే
ఘనతరసంగరంబిపుడు గాడగియుండగ వ్యాధులన్న నే
మనిపలుకంగలారు సుబలాన్వితులైన రణాభిలాషకుల్."

అనిపలికి "నావలన నిప్పుడే కార్యము కాదఁగి యున్న" దనియెను.

ధర్మ—సెబాసు ! భీమన్నా ! ఇప్పుడీమాటలు వినుటచే నామనంబు పరిపూర్ణానందభరితమైయున్నది. అప్పుడు నీవేమని చెప్పితివి.

భీము.—నాయనా ! నీపలుకు వీరపుత్రుల కనుకూలమగు స్థితియందున్నది-నిన్ను కడుపుచల్లగాఁ గన్న సుభద్రాదేవియే యీ భూతలమున నిజమైనపుత్రవతి.

ఉ. భానుడు గ్రుంకకుండ కురువల్లభుపాదసమీపమందు స
న్మానితుఁడైన ధర్మజు జనంబులు మెచ్చఁగ నంతునంచు నా
ద్రోణుఁడు పల్కినాడటనరుండును మామయు లేరు దాపునన్
మానము సెట్లుగాచెదవొ? మార్గము నీయదెసుమ్ము పుత్రికా !

అని మరియును—

ఆ. తమ్మిమొగ్గరంబు, దా కుంభసంభూతుఁ
డిపుడు సృష్టిజేసె; నెఱుగ రెవరు
దానిభేదనంబు తండ్రి ! నీవొకఁడవు
దప్ప; మరియునీదు తండ్రి దప్ప.

గీ. అందు నీతండ్రి సకలశస్త్రాస్త్రవేది
యైనసంశప్తకులఁ జంపనరిగె నేడు-

అతఁడు లేకుంట, నీవె దిక్కైతి విపుడు
వేరుగా నెంచఁబోకు; కుమారవీర !”

అని పలికితిని.

ధర్మ—అంత నభిమన్యుఁడేమనియెను ?

భీము—నాపలుకులు విని, మహాపరాక్రమశీలుఁడై విజృంభించి-

“ఉ. ద్రోణుఁడు గర్వమానసముతో నిపుడేమి తలంచె- సర్వభూ
జనులు చూచుచుండ, కురుజాతిశిరంబులు వంచునట్లుగా-
ప్రాణములుండగా గురుని పారునిబట్టి యనాత్మజాతు స
న్మానితపాదపద్మ భజనం బొనరింపగ జేతు జూడుఁడీ ”

అనిపలికెను.

ధర్మ—పరాక్రమ తేజోవిలసితుండగు నభిమన్యుకుమారుని జన్మము
నకు భరతఖండమెల్ల గర్వింపవలసియున్నది.

[తరువాత నకులసహదేవులతో నభిమన్యుఁడు ప్రి॥]

అభి—తండ్రులకు నమస్కారము— చిన్నమామయ్య ! వందనము.
అందరునాయనా ! జయశాలి వయ్యెదవుగాక !

ధర్మ—(దగ్గఱకుఁ దీసికొని)

గీ. మామయును తండ్రియును రిపుమారణంబు
సలుప యాదవులైన సంశప్తకులను
దునుమ నరిగిరి కౌరవుల్ దుష్టమతులు
నీదుప్రజ్ఞావిశేషంబు నిరుపమాన,

మరయు నీభార్య గర్భిణి- పరమసాధ్వి
నీజనని యేకపుత్రి- పరాజయంబు
జయము దైవానుమతములు- సంగరమున
కిపుడు బాలుని నిన్నంప, నేనికతమొ-
బడలి దేహంబునను గగుర్పాటు గలిగె-
నాయనా! యెట్లు రిపుజననాశనంబు
జేసి మాకంటఁ బడెదవో!- భాసురముగ-
తనయ! భీముడు కవలు సాత్యకియునీకు
వెంబడినిఁ గాపుగానుండి, వివిధగతుల
రక్షణము సేతురయ్య! నీవేక్షణంబు
తమ్మి మొగ్గరమున నుంత దారినిత్తు
వాక్షణంబున విచ్ఛిన్న మగువిధమునఁ
జేసి భేదింతువు నీశ్రమ వాసిపోవ
కౌరవుల దుర్మద మణంపఁ గలరువారు
వ్యూహభేదనమాత్ర మీవొనరఁజేసి
మరలి రావయ్య వీరకుమారవర్య !

అభి.— పెదనాయనగారూ ! బెంగటిల్లవలదు.

ఉ. ద్రోణుఁడు గర్వమానసముతో, నిపు డేమితలంచెనొ ? - సర్వభూ
జానులు చూచుచుండ కురుజాతి శిరంబులు వంచునట్లుగా
ప్రాణము లుండఁగా గురుని పారుసిఁ బట్టెద; కట్టి తెచ్చి,
తన్మానితపాదపద్మభజనం బొనరింపఁగ జేతుఁ జూడుఁడీ.

(అనుబంధము 4.)

ధర్మ—నాయనా!- అభిమన్యకుమారా!

గీ. ఎందఱరివీరవరులు నిన్ మ్రింద జేయ
వచ్చి పడుదురు గాక! నీపజ్జ నిక ని
రంకుశస్థైర్య మగుగాక యాహవమున
నీకవిజయంబు గల్గున నింద్యకీర్తి.

(దీవించును.)

భీము—(స్వగతము) కటకటా! ఎన్నడును- అశ్లీలము లాడని ధర్మరాజు నోటివెంట నశుభావహంబులగు పల్కులు వెలువడెనేమి? ముందేమి జరుగనున్నదో కదా! (ఆలోచించి) ఊఁ ఏమైన నేమి? మేమందఱము వెంటనే యుందుముగదా! (ప్రకాశముగా) అగ్రజా! మాకింక సెలవిండు.

ధర్మ—నాయనా! ఇక పొమ్ము- మీకు వేళ యతిక్రమించును.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.





శ్రీరస్తు

# పద్మవ్యూహము.

## చతుర్థాంకము.



### ఒకటవరంగము.

[పద్మవ్యూహముఖమున సుమిత్రసహితుడగు నభిమన్యుడు]

అభి—సుమిత్రుడా! గురునిబుద్ధిచాతుర్య మీవ్యూహనిర్మాణమాత్రమున నెరుంగవచ్చును సుమా

చ. కనుగొనుమా సుమిత్ర యెటుగాంచిన వ్యూహపునాల్గుదిక్కులం
దను ఘన యోధుల న్నిలిపి దుర్గముడైన గురుండు మధ్యగా
తన యరదంబు నిల్పి ననుదార్కొనసుండెను సిద్ధయత్నుడై
రణమిళ దివ్యమార్గణ పరంపరనన్నిబిడం బగుం జుమీ.

ఇదియేవ్యూహాముఖము. దీనిం[illegible]జించి నేను లోన బ్రవేశింతును నేను వ్యూహవిచ్ఛిన్నము చేయుటయే తడవుగా మనపైని శిత సాయకంబు లనేకసహస్రంబుల వర్షపాతంబుగా గురియును. నీవించుక జాగరూకుడవై యుండుము.

సుమి.—బాబూ భీమన్నగారింకను వెనుకబడియే యున్నారు వారువచ్చిన వెనుక వ్యూహ భేధనము చేయవచ్చును రవంత శాంతినందుదమా

అభి.—ఓయి పిరికివాడా అసహాయస్థితి రణ మొనర్ప బయల్వెడలిన మనకొకరిసహాయమేల భీతిల్లక నావెంటరమ్ము క్షణమాత్రమున సర్వకురువంశ సంహారము గావించెదను.

సుమి.—బాబూ! వ్యూహాంతర్గమనమే కాని మీరుబహిర్గమనము నెరుంగరు. ఈస్థితిలో కార్య మెటుపోయి యెటువచ్చునో పదుచుదనంపునాహసము ప్రమాద హేతు వగునేమో యని సంశయించుచున్నాను.

అభి.—ఓనిత్యశంకితుడా!

(అనుబంధము 5)

గీ. ఖండనముఖంబునందున బ్రాలుమాలి
శంకనందితిమేనియు శత్రువరులు
మనలశౌర్యహీనులుగాగ మదిదలంచి
ఘనతరముగ విజృంభింతు గాదె! యిపుడు

కావున నిపుడేమాత్రము నాలసింపదగదు నీవు శంకాసంకుల మానసుండవై తివేని యిందే నిలచిపొమ్ము నేను శరమాత్ర ద్వితీయుడనై సంగ్రామముం జొచ్చి యధిక సాహసంబులు రెండును గావించుకొందును.

సుమి.—ఆయుష్మంతుడా, నీహితంబుకోరి పచించితినిగాని సాహస్య మొనర్ప నెన్నడైన బ్రాలుమాలి యుంటినా ఇదెరథము తోలుచున్నాను.

(పద్మవ్యూహమును ఛేదించి యిరువురును లోనికరుగుదురు.)

తెరవాలును

# రెండవ రంగము.

(కౌరవులు ప్రవేశింతురు.)

దుర్యో—యోధాగ్రేసరులారా ! చూచితిరే ! అభిమన్యుని సాహసము. కనుమూసి తెరచినంతలోన పద్మవ్యూహముం బటాపంచలు కావించి లోనఁబ్రవేశించెను. ఇపు డేదియుక్తకార్యమో దానిని యోచింపఁదగును.

ద్రోణు—సరే! ఇందాశ్చర్యమేమున్నది ? సరిగా మన మనుకొన్న విధంబున నీబాలసింహము వచ్చి బోనులో నిఱుకుకొనెను. ఇక బయల్వెడుట యాతని వశముగాదు. మిగతసేనలను భీమాదు లెదుర్కొనకుండ మనము సమర్థుఁడగు వీరు నొకని వ్యూహముఖంబున నిలిపి మనము యథాపూర్వముగ చతుష్కోణంబులందున నమరియుండఁదగును

దుర్యో—వ్యూహముఖంబున భీమాదుల నెదుర్కొనఁదగిన బలశాలి యెవ్వఁడు గలఁడు ?

సైంధ—(స్వగతము) నాకిదియే మంచిసమయము! (ప్రకాశముగా) మీరు నాయందు విశ్వాసము గలవారైనచో నాకిది వరవాసరము. భీమాదులనే కాదు; హరిహరుల సయిత మెదుర్పఁగలను.

(అందఱును సంశయములతో మొగములు చూచుకొందురు.)

సైంధ—మీరందఱును నాశౌర్యమునందు శంకించుచున్నట్లు తోఁచుచున్నది. అట్లయిన నాలకింపుఁడు. తొల్లి పాండవులు వనవా

సము చేయుచున్న కాలమున నేను ద్రౌపదిం జెఱఁబట్టుట మీరందఱు నెఱింగిన విషయమేకదా! అంత దురాత్ములగు పాండురాజనందనులు నాతలఁగోసి పరాభవించుటయు నేను తత్పరాభవమును సహింపనోపక శివునిగూర్చి తపం బాచరించి ప్రసన్నుం జేసికొంటిని. శివుఁడు ప్రసన్నుఁడై నీకేమి కావలయునని యడుగ నేను ముందు రాఁబోవు కురుపాండవసంగ్రామకాలమున నొక్కదినము పాండవుల నందఱ నెదుర్పఁగల సామర్థ్యమిమ్మని కోరితిని. శివుఁడందులకియ్యకొని యంతర్హితుండయ్యెను. నాటివరవాసరంబు నేఁడు నాకుపకరించును. కావున మీరెవ్వరును సంశయింపఁ బనిలేదు.

ద్రోణు—సెబాసు ఇదియును మనకొక వరమేయైనది.

దుర్యో—ఓహో! బాపగారు నేఁడు పట్టపగటి సూర్యునివలె ప్రకాశింతురు గాఁబోలును. ఈవరదినంబు గడచిన పిదప బావగారి పని యేమగునో మాత్రము తోఁపకున్నది.

ద్రోణు—ఈఘట్టము గడచిన పిదప భావిస్థితిం బరికింపవచ్చును. సైంధురాజా! నీవిక వ్యూహముఖమున నిలచియుండుము. మేమంతర్భాగమున కరిగెదము.

సైంధ—భాగ్యము.

(అనుబంధము 6)

ద్రోణు—యోధులారా! రండు; మన మరుగుదము.

(సైంధవుఁడు తప్ప అందఱును నిష్క్రమింతురు)

సైంధ—(స్వగతం) భళి భళీ!! చిరకాలమునుండియు—శోకముప్పున గార్చిచ్చువలె మండుచున్న పరాభవజ్వాలను జల్లార్చుకొనుటకు నేడు గదా సమయము మొదవెను. నన్ను బంధించుటయే కాక కేశములంగూడ తఱిగి విడిచిరిగదా దుష్టపాండవ హతకులు. అందులకు తగిన ఫలమును నేడనుభవింపఁగలరు......అదుగో! మా భీమన్న బావగారీవంకకే వచ్చుచున్నారు—పాపము—పరామర్శింతము.

(భీముఁడు ప్రవేశించును.)

భీము—(వెనుకకు జూచుచు) ఓహో! సాత్యకి నకులసహదేవులారా! బాబు వ్యూహముం జించుకొని యిప్పుడే కడుదూర మరిగెను—ఏదేని ప్రమాదము రాకమున్నే, మన మందుకొనవలయును. రండు—రండు.

సైంధ—(అడ్డమువచ్చి) ఓహో! భీమన్న బావగారాయేమి? ఎందులకో, కడురయంబున నరుగుచున్నట్లున్నారు—ఏదైన ప్రళయము రాలేదుగదా?

భీము—ఓరి!—సైంధవహతకా! దుశ్శకునపక్షివలె నీ వెదురైతివా నీపని తరువాతచూతును—దారివిడువుము.

సైంధ—ఏమి యీతొందర! అభిమన్యురక్షణమునకేనా—ఇప్పుడందులకంత వేగిరపాటేల!—అభిమన్యు నెవ్వరును గొంతుకోయుటలేదుకదా! అంతదనుక వచ్చినపుడు వదలెదనులే దారి

భీము—ఓరి సిగ్గుమాలినశిఖండి—ఎన్నఁడును లేనిది, నీకెంత ప్రాముపచ్చెనురా!—నాచే శిఖతరిగించుకొని సిగ్గువడి యడవిదారిని బట్టితివిగాదా!—మరలనెంతిలో మనుష్యులలో గలిసితివి.

సైంధ—ఓమృష్టభోజనా!—నాఁడు నన్ను మీరు గావించిన పరాభ
వమే—నేఁడు సాఽభిమన్యముగా మీయందఱి మరణముల
కుఁ గారణ మగునని నమ్ముము.

భీము—ఓరి పిఱికిపందా! నాఁడే, మాదుస్సల విధవముండయగునని
నిన్ను మన్నించి విడచినందులకా గోగునారతడపవై వచ్చి
ఘోర సర్పమవైతివి!—నిజముగా దారివిడచెదవా లేదా !

సైంధ—బావగారూ! ఎట్లు విడువగలను. మీరెఱుంగని దేమున్నది
నేడుమిమ్ముల నందర నెదుర్కొనవలయునని, యీశుభకా
లముకొఱకే కదా నేను వేచియున్నది. తెలివిమాలి యీత
రుణమున మిమ్ము—లోనికివిడచినచో, మరలనాకిట్టి శుభ
కాలము లభ్యమగునా!—

భీము—అట్లయిన నిన్నోడించియే లోనికి బోవలయునా!

సైంధ—సాధ్యమైనచో నోడింపనూవచ్చును.

భీము—అట్లయిన సంగ్రామయుక్తమగుచోటికి రమ్ము

సైంధ—బావగారి చిత్తము

(ఇద్దఱు నిష్క్రమింతురు)

తెరవ్రాలును.



# మూడవరంగము.

---

పద్మవ్యూహాంతర్భాగము.

[అభిమన్యసుమిత్రులు రథస్థులై ప్రవేశింతురు)

సుమి — బాబూ! తామరతంపరలవలె — నీకురుసేన లమితములై — తండోపతండములుగ వచ్చిపడుచు, నిసుకపాతరలవలె — తఱుగకున్నవి. సారథినగు నాశరీరమే — జల్లెడవలె చిల్లులు వడియున్నప్పుడిక — రథికుఁడవగు నీస్థితి యెట్లున్నదో యెఱుఁగ వలయునా?

అభి — సుమిత్రుఁడా! భయపడకుము — రణమన్న నేమనుకొంటివి? సంగరమునఁ గఱకుటమ్ములు విసరుకొందురు గాని, మెత్తని పూలచెండ్లు విసరుకొందురా? — నేఁడు నేను రణమునకు వచ్చిన సంకల్పమేమో నీవు వినియే యుంటివిగదా!

ఉ. కౌరవులందఱున్ హతము గావలె, యుద్ధసమాప్తి గావలెన్
బీరములాడినట్టి రణవీరులు నాశమునందఁగావలెన్
కౌరవసేన కిప్పు డధికారము దాల్చినద్రోణుఁ డింక మ
త్తీవ్రశరాగ్రులందున, దగుల్కొని రావలె తండ్రిపాలికిన్.

ఈసంకల్పము నెరవేరునంతదనుక - నాప్రాణములు పోయినను సరియే రణమును మాత్రము వీడఁజాలను, నాహృదయము చతుష్కోణములందున్న మహారథులగు నల్వురుకౌరవుల ఢీకొన వలయునని యున్నది — మనకు మిక్కిలి సమీపమున దుశ్శాసనుఁ డున్నాఁడు — అతనికెదురుగా రథము నడుపనిమ్ము.

(రథము నడచును. వ్యూహకోణమున దుశ్శాసనుఁడు కనబడును.)

దుశ్శా—(స్వగతము) ఓహో! అభిమన్యుఁడు తొలుదొల్త రథమును, నావంకకే నడుపుచున్నాఁడు, నేనిఁక జాగరూకుఁడనై యుండుటయే మంచిది.

(శరచాపములు సవరించును)

అభి—(రథమునుండి లంఘించి దుశ్శాసనుని జుట్టుపట్టుకొని) ఓరోరి లజ్జావిహీనుఁడా? పశుప్రాయుఁడా! దుశ్శాసనా!! తల్లివలె గారవింపఁదగిన వధూనికరం గొప్పుపట్టి యీడ్చి, చీరలొల్చితివే మిరా! భ్రష్టా!—చిరకాలమునకు గదరా నాభుజపంజరమునం బట్టువడితివి!

చ. ఖలమతి! యాత్మలో, జననిగా దలపోయగదగ్గ సాధ్వినిం
జలమునఁ బట్టి తెచ్చి, రిపుసంఘము గాంచగ కేశపాశముం
బలిమిని లాగినాడవు, సభాస్థలి కోకల నూడ్చినావు; ఛీ!
తులువ! యఘప్రపూర్ణుఁడవు: దుష్టుఁడ యిప్పుడు చిక్కినావురా!!

గీ. నీవు మాతల్లి ద్రౌపది నేవిధమునఁ
కేశములు బట్టి యీడ్చితో కినుకమీర,
నావిధంబున నినుబట్టి యీడ్చి యామె దుఃఖ
భారమును దీర్చువాఁడనో పాపచరిత!!

(కేశములపట్టి యీడ్చును)

దుశ్శా—ఓరి అభిమన్యు! నే నేమరియున్నత రిపైకి లంఘించి—కేశములు బట్టి యీడ్చు టొకపౌరుష మనుకొంటివా! రమ్ము—సమయుద్ధ మాచరించి, యాపిదప మన మన జయాపజయంబులు నిర్ణయింతము.

అభి—ఓరీ ! నామమాత్రి లజ్జాభిమాన విహీన యువరాజాధమ !!—
నీకు పౌరుషము గావలసి వచ్చినదా ?

గీ. అంటరాని దైయున్నట్టి యాజ్ఞసేని
నంటి కోక లూడ్చుట పురుషార్థమేమి ?
పాపి ! కేశంబు లీడ్చుట పౌరుషంబె ?
నాడు పౌరుష మనుమాట నాటదె ?

మీరెంత యపౌరుషకర్మంబు లొనర్చినను, నాకది యుక్తము గాదు.-ఏమంటివా ?

గీ. శౌరి కేను గూర్చు కూరిమి యల్లుండ
వీరపార్థునకుఁ గుమారవరుఁడ
కడిమి నేనధర్మకర్మంబు సలిపిన
పితరు లందఱకును పేరుచేటు

కావున నెట్లు ధర్మమో యట్లే నిన్ను వధింతును రమ్ము.

(ఇద్దరును యుద్ధము చేయుదురు. అభిమన్యుఁడు, దుశ్శాసనుని కంఠము కోయఁబోవును.)

సుమి—బాబూ ! దుశ్శాసనుని చంపకు—దుశ్శాసనుని చంపకు—
ఈపాపివక్షముం బెకల్చి వేడినెత్తురు త్రావెదనని "భీమసేనుఁ
డు ప్రతిజ్ఞ చేసియున్నాఁడు.

అభి—ఓహో ! భీమప్రతిజ్ఞ ముందేమగునో గాని. యిప్పు డీదుష్టుఁ
డు మృత్యుముఖము నుండి బయటఁబడియెనే ?—ఓరీ ! దు
శ్శాసనా ! పెదతండ్రిగారి ప్రతిజ్ఞచే సురక్షితుఁడ వైతివి—
పొమ్ము.

(కాలితో దన్నును. దుశ్శాసనుడు పారిపోవును.).

(తెరలో)

ఓరోరి-పార్థనందనా !—పసివాఁడగు దుశ్శాసను నోడించినట్లు కాదురా—రమ్మురా—నాపై నీభుజాసారముం బ్రదర్శింపుము.

అభి—(తనలో నవ్వుకొని) యువరాజై నంతనే దుశ్శాసనుఁడు పసివాఁడయ్యెనఁట ! ఇవి సూతకుమారుఁడగు కర్ణుని వాక్యములు కాఁబోలును ! నాతండ్రినిఁ జంపఁ బ్రతినఁబూని కురురాజు కండాయమందు కడుపునిండ మేయుచున్న పరాన్నభుక్కు కాఁడా వీఁడు! రానిమ్ము; తండ్రిగారి శ్రమను నేఁడే తగ్గించెదను.

(కర్ణుఁడు ప్ర॥)

కర్ణు—ఓరీ ! పసివాఁడా ! కన్నులైన బాగుగా విప్పితివఁటరా! తారతమ్య మెఱుంగక యింతలో పెద్దవారిపై ప్రతాపముం జూపుచున్నావు !

అభి—ఓరీ రథకారకులకళంక ! రాధాగర్భభారభూత! కర్ణ ! ప్రతాపముం జూపునెడల పెద్దపిన్న తారతమ్యములు గాని—కన్నులు విప్పినా లేదా యను చర్చగాని యక్కఱలేదు—పద్మవ్యూహ నిర్మాణమునకుఁ బూర్వమున, నాచే దెబ్బలుదిని, దిశల చెల్లాచెదరై పారినవేళ—పెద్దపిన్న తారతమ్యమను భూతమయ్యెను గాదా! మఱల నేమొగము పెట్టుకొని—వచ్చితివి ?

కర్ణు—అందులకా నీకీ గర్వము ! ఓరివెడగా—అట్లుకాదు చూఁడు

గీ. సోమసూర్యుల కైనను వ్యోమమందు
గ్రహణయుగళ మొక్కొకవేళఁ గలుగవచ్చు!

వట్టులనె ధీరు లగు వారి కగునుపాట్లు
గ్రహణములు గల్గఁ గలవె రిక్కలకు నెల్ల.

అభి—ఓయవినీతుఁడా! మీ శౌర్యహీనత నిట్టి యుపమానముల తోడనా సమర్థించు కొనుచుంటివి? అది అట్టిదికాదు; విను.

గీ. భీమగజమెంత దోర్బలో పేతమైన
చిన్నకంఠీరవముచేతఁ జెనకఁ బడదె?
గ్రహణముల భాతి యొక్కొక్క కాలమందు
జయము నందఁగ గలదె! గజంబు కర్ణ!

కర్ణు—ఓరి బాలకా! తండ్రు లడవులను బట్టగా మేనమామ యింట దిన్న తేరతిండి నీచే నెన్నికారు లఱపించుచున్నదిరా?

అభి—(సాఽక్షేపముగా) ఓహోహో! ఏమి స్వాఽర్జనపరునిద ర్శనము గల్గినది నేటికి?—నేను మేనమామ యింట తేరతిం డిఁ దిన్నవాఁడ ననుమాట లోకవిదితమే—అదిగాక—నా మేనమామయింట నేను దినుటలో నాక్షేపణమాత్ర మేము న్నది? కాని- ఎక్కడి సూతపుత్త్రుఁడు! ఎక్కడి కౌరవవంశ ము!— ఓజ్ఞానహీనుఁడా! నీవేమి చుట్టమవని కురురాజు తిండిచే పొట్టనింపు కొనుచుంటివిరా!—ఆత్మజ్ఞానానభి జ్ఞుఁడా!—

గీ. అర్జునునిఁ జంపగలవంచు నాశఁజెంది
కొంపఁజేరిచెఁ బోనిన్ను కురువిభుండు
పార్థుఁ డెటికిరా నిన్ను భండనమున
నిపుడె బోక్కారు రమ్ము సహింపనింక.

కర్ణు—అట్లయినసరమ్ము.

(ఇద్దఱును రణమొనర్తురు. కర్ణుని అభిమన్యుఁడు గొంతు క్రోయఁబోవును.)

సుమి—(అడ్డమువచ్చి) బాబూ! కర్ణుని చంపకు; కర్ణుని చంపకు—వీనిని వధింతునని మీతండ్రిగారు ఘోరప్రతిజ్ఞ గావించిరి.

అభి—ఛీ ఛీ ఛీ ఛీ! ఎంత యాశాభంగము గలిగినది! చేఁజిక్కిన కర్ణదుశ్శాసను లిరువురును సులభముగా ప్రాణములను దక్కించుకొనిరే!—ఇంక నే నెవ్వరిని చంపుదును?........ ఓరి సూతపుత్రా! రెండవసారి బ్రదుకఁగంటివి?—హామ్మ చంపదలఁచిన, నాజనకుఁడే నిన్ను రక్షించెను.

(కాలితోఁదన్నును—కర్ణుఁడు పారిపోవును.)

అభి—సుమిత్రుఁడా!—యమపుర ద్వారదర్శనముం జేసిన, యీదురాత్ముల ప్రాణములు మరలివచ్చినవిగదా!

సుమి—బాబూ! ఏమిచేయుదము—గురుల ప్రతిజ్ఞలను మనము భంగము చేయదగునా?—

అభి—వెఱ్ఱివాఁడా! మహాప్రళయకాలము దాపురించి—రణయజ్ఞమునం దొక్కొక్కప్రాణియు నాహుతియగుచుండగా నింకను గురులనిప్రతిజ్ఞలని—కొట్టుకొందు వేమి?—

సుమి—బాబూ! ప్రకృతిధర్మము ననుసరింపక తప్పదుగదా!

[తెరలో]

ఓరీ! పాండురాజపౌత్రి! ఎందుబోయెదవురా! నిలు—నిలు; పారిపోకు.

అభి—సుమిత్రుఁడా! వింటివా యాకంఠస్వరమును—ఈసారి కురుకులపతియగు దుర్యోధనమహారాజుగారే— నన్నన్వేషించుచు వచ్చుచున్నట్లున్నది. కురుకులాటవి కీదుష్టుఁడే వేరుపురుగు సుమా !—రానిమ్ము వీనియాయువునైన మనపాల బడవేసికొందము.

సుమి—(స్వగతము) భీమన్న ప్రతిజ్ఞ స్మృతికిఁ దెత్తునా;.........కానీ తొందరయేల?

(తరువాత దుర్యోధనుఁడు ప్రవేశించును)

దుర్యో—ఓరీ పార్థసుతా! ఏమిరా నీమిడిసిపాటు?—తొండముదిరి యూసరవిల్లియైనవిధమున నున్నదే నీచందము—

అభి—రారాజుగారు కాబోలును! మీరొక్కరే మిగిలియుంటిరని నేనందుసంతాపము నణంపవచ్చితిరని తలంచెద—అయ్యో! పట్టెబీరములాడుట కిది యభిమన్యునితోడ సంగ్రామమునుఁడీ! గుర్తించితిరా? —

సీ. అర్ధరాత్రింబున నగ్నిదగుల్పఁగా
నిది మృణ్మయగు లక్క యిల్లుగాదు
కపటంపు జూదంబు గల్పించి మోడింపఁ
జూతమన్నను ధర్మసుతుఁడుఁగాడు
ఏకవస్త్రనుఁ జేసి కోకలనూడ్వంగ
జేలనైనట్టి పాంచాలిగాదు
దొంగపాచికలతో గూర్తుండవౌచు, కా
నలకంపఁ బంచపాండవులుగారు

కన్నులనువిప్పి నావంకఁ గనుడునుంత
మొన్నరణమందున జయించియున్న నేను
పార్థతనయుడు నభిమన్యసార్థకాఖ్య
గల్గువీరుడ కురువనాంగారమూర్తి.

(7 అనుబంధము)

దుర్యో—ఓరీ! బాలుఁడవగు నీతో వాగ్వివాద మేల సంగరము నకే సంసిద్ధుఁడను, రమ్ము.

అభి—అట్లయిన నేను—ముందే సంసిద్ధుఁడనై యున్నాను. రమ్ము
(ఇద్దరును యుద్ధముచేయుదురు. అభిమన్యుఁడు దుర్యోధనుని చంపబోవును.)

సుమి—(అడ్డుకొని) బాబూ! బాబూ! రారాజును చంపకు. రారాజును చంపకు—ద్రౌపదీమహాసాధ్వినిఁజూచి తొడఁజూపిన వీనితొడలు విఱుగఁగొట్టెదనని, భీమన్నగారు ప్రతిజ్ఞబూనిరి.

అభి—(నిరాశతో) ఈమాట నాకు తొలుత నేలవచింపవైతివి! ప్రతివానితో యుద్ధమును- తుదకు ప్రయాసమునే మిగులుచుండెనుగదా!—......ఓరి దుర్యోధనహతకా! నిన్ను జంపుభాగ్యము నాకుఁ గలుగలేదు. నీవు మాపెదతండ్రిగారి పాలఁబడవలసినవాడవగుటచే విడిచితిని. పొమ్ము.

(కాలితోఁదన్నును.)

దుర్యో—(పారిపోవును.)

అభి—సుమిత్రా! నీ పితృప్రతిజ్ఞలను జ్ఞప్తికిఁదెచ్చి - నిష్కారణముగా కార్యభంగము చేసితివి సుమా!

సుమి—బాబూ మీరు తొందరపడి వీరిసి చంపియున్నఁ గలుగ బోవుప్రమాద మెట్టిదియో యూహింపరైతిరి.

[తెరలో]

ఓహో పాండవులారా శల్యుడు పాండుసేనలపాలిటి కాలుడై వచ్చిపడియెను ఇందులకుపాయమాలోచింపుడు.

అభి—ఓహో! ఇదియొకటివచ్చెనా ...............సుమిత్రుడా నారథమునాయత్తము చేయుము- మద్రపతిని జయించి వచ్చెదను.

సుమి—రథముసిద్ధముగానేయున్నది .........అమ్మయ్యో-వక్షస్థలమున నెంతపెద్దగాయమైనదో!- ఈరక్తముచేతనే కాబోలును కవచమంతయుః రక్తమయమైపోయినది!

అభి—అందులకేమియు భయములేదు- గాయమునకు కట్టుగట్టుకొ వచ్చునులే-రథముః పోనిమ్ము- (ఎక్కును.)

సుమి—మరల నింతలో మద్రపతితో పోరెక్కుడదాపురించినది. బాబూ !- వెనుకజిక్కిన భీమాదులిదెవచ్చెదమని, యింతదనుక జాడలేరు. మీప్రతాపమా వెనుకముందులు చూడనిచ్చుట లేదు. గాయమా బలమైయున్నది. మరల మరల- సంగరముపై సంగరము మూర్కొనుచున్నవి. బాబూ నాకేమియుఁ దోచుటలేదు. అంతయు నగమ్యగోచరముగా నున్నది !

అభి—సుమిత్రుడా! నీఘోషవలన నిప్పుడేమియు ప్రయోజనము లేదు. ఎట్లుకాకున్న నట్లుకాకమానదు- రథము సాగనిమ్ము.

సుమి—(స్వగతము) ఏమిజరుగనున్నదో తెలియదు- దైవమా! గా
యమునకు కట్లయినను గట్టుకొనుట కవకాశమీయవా?

(అభిమన్యసహితుఁడై నిష్క్రమించును.)

[తరువాత-ద్రోణిసహితులై కౌరవు లుప్రవేశింతురు.]

ద్రోణి—వ్యూహముఖంబున భీమాదులను సైంధవుడు బాగుగా
నరికట్టినాడు అందులకే - యింతటిదింతటగడిసినది.

దుర్యో—అభిమన్యుఁడు మిమ్మెదుర్కొనలేదు గావుస, చల్లగాప్రసం
గించుచున్నాడు- వీఁడు బాలుఁడుగాడు; మాపాలిటి కాలుఁ
డయ్యెను- వానిని మారణముచేయుటకు తొలుత నేదైన
మార్గ మాలోచింప వలయును.

కర్ణు—అందఱ మొక్కసారిగా పైఁబడి చంపుటకన్న వేరుమార్గము
లేదు.

ద్రోణి—ఇంతేకాదు విల్లువిఱచి విరథుంజేసి- సారథిని నేలఁగూల్చినఁ
గాని సాధ్యముకాఁడు.

దుర్యో—అందుల కింకను సందేహమేల? అట్లుగావింతము. సత్వర
ముగ రండు- (అందఱును నిష్క్రమింతురు.)

[తరువాత సంజయుఁడు ప్రవేశించును.]

సంజ—కటకటా! ఎంతఘోర మెంతఘోరము!!

సీ. ధీమంతుడగు సారథిని గూల్చె నొక్కడిం
 కొక్కడశ్వంబుల నుక్కడంచె

ఉక్కుపోలినపింటి నొక్కఁడు ఖండించి
కేతనం బొక్కఁడు కింద(గూల్చె
ధ్వజముల నొకఁడు విదగ్ధంబులుగఁజేసె
శరములొక్కఁడు రహస్యముగ వదలె
అంబులపొంది నొకండవలీల నిలఁగూల్చె
యురమునందునగాయ మొకఁడుజేసె

కౌరవులు నట్టెసల పాపకర్ములగుచుఁ
మూగియీగతి పక్రృతి దుర్యోగముగను
భావిజనములు నిందించు భంగికోర్చి
కటకటా! పాపఫల మొడిఁగట్టినారు.

సర్వమెఱింగిన కుంభసంభవుఁడును, దుర్జాతికౌరవులతోఁ గలసియెం తటి ఘోరకార్యము చేయసాహసించెను !- పార్థుఁడీపాపకర్మ విన్న సహింపఁగలడా!——......ఓరీ ! కౌరవాపసదులా రా! ఏలరా మితిమీరి త్రుళ్ళిపడెదరు ? మీమిడిసిపాటెంక నెంతసేపు ?- పార్థుఁడు రణమునుండి రాఁడా ! మీపాట్లు చూడమా ?

క. తెలవారునె యొకకల కి
ల్లలికినయంతటనె పండువయి పోయినదే!
ఖలులార ! విజయునకు నిది,
తెలిసిన మీరందుపాట్లు తిలకింపమొకో !-

చ. విరథుని జేసి- క్రూరముగ వింటినిఁదుంచి, రథపరియుక్త స
త్తురగములన్వధించి, యతిదోర్బలశాలులభంగి పావనం

గర మొనరించి, బాలకుని గాసిలియుండిన వేళ సందకుం
బొరిగొని చంపఁబూనెద రె!- పోరున నోటమినంది వందలై

(తెరవంకఁజూచి) మేలు ! విజయనందనా మేలు ! !-

ఆ. చేయి తెగిన వేఱుచేత విల్లుధరించి,
గాయమందు కట్లు కదలనీక-
వ్రేలు వ్రేటునకును వేవుర వేవుర
దున్ముచుంటి వౌర! దోర్బలమున.

నీతల్లియే నిజముగా ధాత్రినిఁ బుత్రవతి- అధములగు నీదుష్టులంద
ఱును తల్లుల కడుపులు చెఱుపఁబుట్టిరి. తల్లీ భరతమాతా !
అనవరతము నభిమన్యునివంటి వీరపుత్రులంగని కీర్తిఁగాం
చుము.

చ. ఘనరణమందు చేయి తెగి, కాలువలాగతి శోణవాహినుల్
మొనసి శవంపుపోగులను ముంచుచునున్నను- జంకబోక మే
ల్తనయుఁడు నీదుకడుపునఁ నితండొకఁడే జనియించెఁగాన నో
జననిరో ! భారతంబ! యనిశం బభిమన్యకుమారుఁ గావవే !

జయ్ ! వీరాభిమన్యునకు జయ్ ! !

(నిష్క్రమించును.)

(అభిమన్యుఁడు రక్తసిక్తాంగుఁడై తూలుచు ప్రవే॥)

అభి—ఓరోరి పారుబోతులారా ! కౌరవచండాలులారా ! ఏమిరా
యింత పౌరుషహీనమైన పనిఁ జేసితిరి ?—రణమున వెన్నుఁ
జూపి—విశుభ్రమై నెగడు—కురువంశమున కంతటికి నపకీ

ష్ఠ నాపాదించితిరే !—నిర్మలమైన యశము సమసిన పిదప-పాపపరిపూర్ణములగు, తనువులా—మిమ్ము రక్షించునవి! నేనాడుచున్న పలుకులనుఁ గూడ పెడచెవిం బెట్టి పలాయితు లగుచుండిరే !......ఈ కాయము.........ఎప్పుడో యొకనాడు......మంటిలోఁ గలసిపోవును.........ఈ ప్రాణము నంతయు.........ఎప్పుడో యొకనాడు...... గాలిలోఁ గలసిపోవును.........ఇవి మీకు శాశ్వతములు కావుగదా! శాశ్వతమైన కీర్తిని మీరు కళంకము చేసికొనఁ జెల్లునా ?—నాశరీరము విశేషముగా తూలుచున్నదేమి చెప్పుమా ?......ఓహో ! .....విస్తారమగు రక్తక్షయమైనది గాదా!—అదియే కారణము—పోనిమ్ము; రక్తమునుఁ బోఁ గొట్టుకొంటినిగాని, శుభమగు నాకీర్తికి కళంకము రాలేదు గదా! అదియే చాలును—ఓహో మఱచితిని—నారథము తో సారథిని వెనుక దిగవైచితినా—(స్మృతినభినయించి) కాదుకాదు—జ్ఞాపకశక్తి మినుకు మినుకు మనుచు మిగుల స్వల్పముగా నున్నది. తులువలగు కౌరవులు నారథమును విఱుగఁగొట్టి—సారథిని భూపతితునిఁ జేసిరిగాదా ?...... శ్రైను—అట్లే జరుగునని తోఁచుచున్నది! పాపము ! శాంతచిత్తుఁడు—నిర్మల బుద్ధిశీలుఁడగు సారథి, సుమిత్రుఁడు మరణించెనో—జీవించియే యున్నాఁడో !.........సుమిత్రుని మరణమునకు మాత్రము నేనేల విచారింపవలెను ?

(అనుబంధము 8)

గీ. సమున్నతంబైన మాస్వరాజ్యమ్ముకొఱకు
రక్తపుం బొట్లనెన్నిటి రాల్పఁగలఁడొ

యాతఁ డన్ని వర్షంబులు యశఃపూర్ణ
తనువు ధరియించి యుండు నీధరణిమీఁద.

ందులకై కన్నీరు గార్చితిమేని- మృతునకు సద్గతులు గలుగవనికదా పెద్దలు చెప్పుదురు! కన్నులు గిఱ్ఱునఁ దిరుగుచున్నందున, నంతయు నగమ్యగోచరముగా నున్నది. (జారిపడిలేచి) ఈప్రాడు శవములు మాటిమాటికిని నాకాలికిఁ దగులుచున్నవి. అపారమైన రక్తసముద్రమున నా కాలు జారుచున్నది కాఁబోలును

(సుమిత్రుఁడు దేకుచు బాధతో ప్రవే॥)

సుమి—బాబూ! బాబూ!

అభి—ఎవరు? సుమిత్రుఁడా! ఏమిరా ఇట్లు బాధపడుచుంటివి?

సుమి—ఇంకెక్కడి బాధ? బాబూ! కడవలతో గ్రుమ్మరించినట్లు రక్తమంతయు గారిపోయినది! పాపాత్ములు నన్ను నేలపై బడవేసినతరువాత—నిప్పటివఱకును బాధచే శ్రమనంది—శ్రమనంది—శవములను తప్పించుకొని, నీమొగ మొక్కసారిఁ చూచి మరణించు నపేక్షతో దేకుకొనుచు- నీపాదముల సన్నిధికి వచ్చితిని.

అభి—అయ్యయ్యో! కట్టయిన గట్టించుకొనుము.

సుమి—బాబూ! నాకుపచారములేల? ఇఁకను బ్రదుకుదునా. మీపాదముల నొక్కసారి నాసమీపమున నుంపుఁడు. ముద్దిడుకొని యీజీవితమును మీపాదసేవయందే గడపిన మహానందమున, నక్షయశరీరసౌఖ్యము ననుభవింతును.

అభి—ఆహాహా! ఎట్టి స్వామిభక్తుని కింతలో నాయుర్దాయము చెల్లిపోయినది.. (పాదములు దగ్గర నుంచును.)

సుమి—(కన్నులకద్దుకొని) బాబూ? పెదతండ్రిగారియాజ్ఞ మఱువకుము నాజన్మకీయానందము చాలును కుక్కలు బాబూ! జాగ్రత్త! పాదములు భద్రము. రక్తపుమడుగులలో జారి పడెదరు. నాప్రాణములు.....నిలువవు......నారాయణ నారాయణ......  (మరణించును)

అభి—సుమిత్రా! సుమిత్రా!! (కదపిచూచి) శ్రీరామచంద్ర! ప్రాణములు పోయినవి! అయ్యయ్యో! ఎట్టి విశ్వాసపాత్రుఁడు- ఎట్టికృతజ్ఞుఁడు గతించిపోయెను.

గీ. బ్రిదికియున్నన్నినాళ్ళును స్వామిభక్తి
తత్పరుండయి దేశభక్తప్రియతను
నాదుపాద సమీపమునందు తనదు
జీవములుబాసె; నీతనిసేవకొఱకు
నగ్నిసంస్కారమైన సేయంగలేని
వ్యర్థమతినైతి: నేమని వగవవలయు

సుమిత్రా! నాకొరకే ప్రాణలాడి భీషణరక్తస్నాన మాచరించి, నా పాదములే శరణ్యములని తుదివాక్యములతో మరణించిన నీయాత్మశాంతికై నేనొక్కమాఱు దీవించుటతప్ప మరేమియుఁ జేయజాలఁను........తల్లీ! భరతమాతా!

గీ. మాతరో! యీసుమిత్రునిమాడ్కి దేశ
భక్తిసంపన్నులైనట్టి వరకుమార
గణము నిక వేలకు వేలుగాఁ గనుము,
వరగుణోపేత! యోమాత! భరతమాత,

(దూరమునఁ జూచి) ఏమి? నాకన్నులేమైన పొరపడినవా ! లేక వచ్చుచున్నావాఁడు నిజముగ బాలుఁడేయగునా ? తిన్నగాఁ జూచి) సందేహములేదు వాఁడు దుశ్శాసనపుత్త్రుడగు దౌశ్శాసని- (నవ్వి) ఏమిది పెద్దలకు సాధ్యముకాలేదు కాని వీడట నన్ను జయించువాఁడు

(దౌశ్శాసని ప్ర॥)

దౌశ్శా—ఓరీ ! అభిమన్యూ ! నాతో ! రణమాచరించి గెలువుము. నీప్రతాపము విశేషముగ సైనికులు చెప్పుకొనుచుండ విని వచ్చితిని.

అభి—సెబాసు! నాయనా ! నీవొక్కఁడవు నీతండ్రిలసేవ నిలిపితివి రమ్మి

(ఇద్దఱును రణమాచరించి యొకరిచేనొకరు కూలుదురు)

(కౌరవులు నలువంకలనుండివచ్చి బల్లెములతో బొడుతురు. పిదప మృతినందనున్నవానిని సైంధవుఁడు పొడుచును.)

అభి—(ఆయాసముతో తూలిపడి( ఛీ! నీచకర్మా ! సైంధవా ! ఇంత పనిచేసితివిరా ! ఈదురితకృత్యము నాతండ్రివిన్న నీతల తరుగునురా దుష్టా ! (పడిపోవును.)

(పుష్పవృష్టి కురియును.)

ఇది చతుర్థాంకము.

---



శ్రీరస్తు.

# పద్మవ్యూహము

## పంచమాంకము.



### ఒకటవ రంగము.

(పటకుటీరద్వారమున కృష్ణార్జునులు ప్రవేశింతురు.]

అర్జు—కృష్ణా ! వాసుదేవ !

సీ. మనకు ద్వారంబు లొనరించు వందిమా
గధులు లేరిది యేమి కంసవైరి!
వేళలందున మ్రోగు భేరీనినాదంబు
• వినఁబడ దేమి కారణము దేవ!
ఎలమి ముత్తైదువ లిరువంకలందున
హారతులిడ రేల శౌరి నేడు!
మనరాకఁ జూచి కుమారవీరులు, వేగ
యెదురు రారేలనో ? కృష్ణ! నేడు
అరసి ముత్యాలు రాహుగ్రహంబు మ్రింగ
వెలవెలంబడు చంద్రమండలముభాతిఁ

దోఁచుచున్నది నాకనుదోయి కిపుడు
యీపటకుటీర మిదియేల ? గోపబాల !!

అదిగాక, గోవింద !—

చ. అని యొనరించి, నే శిబిరమందున కాలిడఁగానె, కన్నుదో
యినిఁబడి, పూర్ణిమాశశి, రహించెడుపోలిక హాసమూర్తియై
నను బిగియారఁగౌఁగిలి నొనర్చెడు బాలకుమారవీరుఁడౌ
తనయుఁడు లేఁడు నేఁడు. తొలిద్వారమునం దభిమన్యుఁడక్కటా!!

కృష్ణు—పార్థా ! ఆందోళనపడకుము- ఏదో దారితప్పి, మనము శిబిరమునకు మారుగా- పాంచాలి పటకుటీరమునకు వచ్చియుందుము. పదము- లోపలికరిగి సావకాశముగ విచారింతము.

అర్జు—కృష్ణా ! నీవేమన్నను సరేగాని, నా మనస్సుమాత్రము మిప్పుడకారణముగ, నభిమన్యునిమీఁదికిఁ బోవుచున్నది.

[తెరలో]

హా ! అభిమన్యకుమారా ? హా ! లోకైకధనుర్ధరా!- బలవంతముగ రణమునకంపి, నీ ప్రాణములు నేను దీసితినిరా తండ్రీ !!

అర్జు—హా ! ధర్మనందనా ! నాయనుమాన మెంతవఱకుఁగలదో. యంతపనియుఁ జేసితివటయ్యా!!- హా బాలకా ! అభిమన్యా! నాగర్భమునఁ గార్చిచ్చుపెట్టితివా తండ్రీ !!-

(కృష్ణునిపై మూర్ఛనందును.)

కృష్ణు—కటకటా ! ఎంతకష్టము సంభవించినది !!

[భీముడు ప్రవేశించును.]

కృష్ణు—భీమన్నా! అర్జునుఁడు మూర్ఛిల్లినాఁడుపట్టుకొనుము.

భీము—(అర్జునుని లోనికి గొనిపోవును)

కృష్ణు—(వెంటనిష్క్రమించును.)

# రెండవ రంగము.



ద్రౌపదీ పటకుటీరము.

[ప్రవేశము:—విచారముతో, ధర్మ, అర్జున, కృష్ణ, భీములు.]

కృష్ణ—పూర్వ మొకనాడు- సుభద్రగర్భమున నభిమన్యుఁడు, పెరుగుచుండినతరుణమందు, మనవిజయుఁడే సుభద్రకు పద్మవ్యూహక్రము నెఱింగించుచుండెను- భేదించునంతవఱకుఁ జెప్పిన తరువాత పార్థుని నే నెందో కొనిపోయితిని. ఈవృత్తాంతమెల్ల గర్భస్థశిశు వాకర్ణించియుండును. అందుచేత- వ్యూహముం జించుటయే కాని, మరల వెలువడుట యెఱుంగఁ డయ్యెను. అది యెఱుంగక- బాలుని బీరంబులను నమ్మి, సర్వజ్ఞునిగా భావించి పంపుదురు అందుచే నింతపనివుట్టెను.

ధర్మ—ఎఱుఁగుదునోయి నాయనా ! ఎఱుంగుదును- ఎఱింగియే- బాలుఁడు పద్మవ్యూహమును ఛించుననియును- అప్పటికి భీమాదులు సరిగాఁ గాచియుండి- సేనలఁ జిందరవందర చేయ లేకపోవుదురా యనియును, భావించి, భీమనకులసహదేవులను, సాత్యకిని తోడుగానిచ్చి మఱీ పంపితిని.

భీమ—మే మేమిచేయుటకైనను- సైంధవుఁ డొకడడ్డుపడి లోపలఁ గాలుపెట్టనీయకపోయెను వానికీశ్వరుఁడు వరమిచ్చిన దుర్దినమట ! అందుచే పిల్లివంటివాఁడు బెబ్బులియై వచ్చెను.

అర్జు—కటకటా ! వాని పాడువరముకూడ, బాబునోరకే దాపురమయ్యెనా !- మాచే తలగొరిగించుకొనిన పిఱికిపందకా యింత ప్రతాపము !- ఎంతటికానికాలము దాపురమైనది

ధర్మ—హా! కుమారా! కుమారా!!- ఎంతలో మాయమైతివి నాయనా!-

సీ. కంసుండు మొదలుగా గలవీరులంద్రుంచి
రాణ జెందినవాఁడు మేనమామ
బకకీచకాది దోర్బలవీర హంతక
విఖ్యాతిగాంచెను పెద్దతండ్రి
దేవగణములుగొల్వ త్రిదివంబు నేలు పరి
తాపపరిభారాశి తాతగారు
కాలకేయాదుల గసిమసంగినవాఁడు
గాండీవపాణిసీ కన్నతండ్రి
ద్రోణముఖ కురుసేనల దోర్బలమున
క్షోభనందించి వెన్నులు జూచినట్టి
రణవిశారదుఁడవు- యొగ్గరమున నొంటి
వగుచుఁ జిక్కితివేతండ్రి! యరులనడుమ!!

అర్జు—కుమారున కెట్టియపాయము వచ్చినఁగాని, రణమున కంపవల దని, మరి మరి చెప్పి యరిగినందులకుఁ గాఁబోలును నాకీఫల ము గలిగించితిరి!

ధర్మ—నాయనా! భీమాదులకు సైంధవుఁ డడ్డుపడకపోయినచో నంతయును సత్యముగనే జరిగియుండును. పాడుసైంధవుఁడు శనివలె దాపురించి............

అర్జు—సైంధవు ననవలసిన పనియేమున్నది? బాలుని నేనువచ్చు వఱకుఁ బంపకపోయినచో- సైంధవుఁ డేమిచేయఁగలిగియుం డును.

ధర్మ—అప్పటిస్థితి యట్లు విషయమై పరిణమించియుండెను.
మొగ్గరము గురుండుప న్నగా- ఛేదించుట చేతగాని
గున నూరకున్న నాయప్రతిష్ఠమాత్రము మనకు
పులిమీద పుట్రయనిన చందమున నందుపై- ద్రో
పాద్దుగుంకులోన, నన్నుగట్టి సుయోధనుని పాదము
నేతునని ప్రతిజ్ఞంబూనుట యొకటి—ఈ రెండును,
కాలాడనీయవయ్యెను. అప్పటికి మిమ్ముగోనివచ్చుట
శప్తకసంగ్రామమునకు, వేగవంతుని బంపితిమి.
బయ్యె.

అర్జు—ఎవ్వరి నేమన్న నా చిన్న తండ్రికి ప్రాణములు పోయి
నాయనా ! అభిమన్య ! నిన్ను జంపుట కెందరిప్ర
విని యోగపడవలసివచ్చెను ?- సర్వజ్ఞుడు - కురుపాండ
ధులకు సమానముగ శస్త్రగురువు- అట్టి ద్రోణునకే
దుర్బుద్ధి కల్గెనన్న నేమనవలయు?- కుంభసంభవ !
సంభవ ! !—

ఆ. చదువు చెప్పుటకును, సంధ్యవార్చింపగ
నప్పగించినార మయ్య నాడు
మోసగించి చంప ద్రోనంబునొడిగట్టి
నప్పగించినార మయ్య నేడు.

కటకటా ! ఎంతటి దైవదుర్విపాకము గలిగెను ?

(అనుబంధము 9.)

మ. వారి మేనల్లుండు, నాకు నందనుండు, ద్రోణాచార్య శిష్యుం
కరశతుంజయుం డార్యసమ్మతుండు నాకాధీశ పౌత్రుండు,

చ్ఛరచాపాన్వితుఁడున్ విరాటపతికిన్ జామాత; నేడీగతిన్
దురమందొక్కఁడు దిక్కులేకపడెనే ? దోస్సారముం గల్గియున్.
హా ! కుమారవీరా ! అభిమన్యు !!—

సీ. హా! పుత్త్ర !! ననుఁ బోలి హరిసారథియుఁగాఁడు
పాశుపతంబుపై నాశలేదు
అకటా ! సుదర్శనంబైన నెఱుంగవు
శూలంబుఁ బాల్పుట చూడలేదు
దేవతలొసగిన తేరైనఁ గనరాదు
దివ్యకిరీట ప్రదీప్తి లేదు
కపికేతనంబైన గానుపించుటలేదు
మహితాశ్వయుగళంపుమహిమ లేదు
ఇన్ని యున్నవి గాని, నే నెన్న డెఱుఁగ
నెపుడు నేర్చితివో తండ్రి ! యింత నేర్పు
సవ్యసాచి యనెడు పేరు సార్థకంబు
గాదు నాకు కుమార ! సంగ్రామవీర ! !—

అకటా! ఎట్టిదుఃఖమైన భరింపనగునుగాని, కటకటా ! శత్రులకైన నీగర్భశోకము తగదు—

ధర్మ—నాయనా ! ఎంతదుఃఖించెదవు ! ముందు జరుగఁబోవు కార్యవిధాన మేమో యాలోచింపవలెను గదా !

అర్జు—నిలివెడుకొడుకును నిప్పులుచేసికొనుటే యిక మిగిలిన విధానము. ఇంతకన్న నేమున్నది!—కృష్ణా! ఎంతపనిచేసితివయ్యా! సర్వజ్ఞుఁడవు; నీ వెఱుఁగనికార్య మెందైనఁ గలదా !—

గీ. శిరము లెగసి నాపదముల చెంతబడిన
నింత ఘోరసంగరము నే డెవరిదనిన
నిజము; ద్రోణుని దంచు బొంకితివిగాని
నాకుమారునిదని తెల్పినావె కృష్ణ !!—

నిజ మేమాత్రియు నా చెవిని వేసియున్నను, నాకుమారునిఁ గాపాడుకొనుటకు నేను పాలుమాలుదునా !

కృష్ణు—అర్జునా ! ఏమి యిట్లూరక నాడుదానివలె వాపోయెదవు ?-రాచబిడ్డకు రణమరణముగలుగ నానందింపవలయు గాని దుఃఖపడెదరా !—రణమున నిప్పటికి మృతులైన రాచబిడ్డలందఱును మీ యభిమన్యునివంటివారు గారా ! అందఱుఁ, నీవలె నేడ్చుచుండిరా ?

అర్జు—అయ్యయ్యో ! నాకొడు కందరికొడుకులవంటివాడు కాఁడయ్యా ! కృష్ణా !! —

చ అలయదు వానిమేను, రణమందు శరాహతి నొచ్చుచుండినన్
కలకలలాడు నెమ్మొగము కాంతిని బాయదు సుంతయైన, ని
శ్చలమగువాని నెమ్మనము-జంకదు డొంకదొకింతయైన, నా
కులమును నిల్పఁగాఁదగిన కొడుకు —దిక్కిఁక నేది మాధవా ? —

చ. ఎవని మొగంబుఁ జూచుకొని యీరణముం దలపెట్టినారమో
యెవఁడు కులంబునిల్పునని, యెంతయు నాశ వహించి యుంటిమో
బవరమునందు నెవ్వనికిఁ బ్రాణములిచ్చిరి శత్రుసైనికుల్
భువి నటువంటి సచ్చుతుఁడు వోయిన మాగతియేమి మాధవా?

కృష్ణు—ప్రపంచమున నందఱిపుత్త్రులు నందఱకు నట్లేయుందురు—
"కాకిపిల్ల కాకికి ముద్దనుట యెఱుంగవా ?"

[తెరలో]

మహాత్ములారా! పాండవులారా!—ఘటోత్కచ నకుల సహదేవులు శాంబునకు చితివిధిని సిద్ధపఱచి మిమ్ముల రమ్మనుచున్నారు.

అర్జు—ఆహాహా! ఎట్టిఘోరవాక్యములు వినవలసివచ్చెను.

కృష్ణు—అర్జునా! ఇంక నాలసింపనేల? లెమ్ము—పెద్దబావగారూ! లెండు.

(అందఱును నడతురు.

[తెర లేవఁగా శవములు గుట్టలుగాఁ గాన్పించును, ఘటోత్కచ, నకుల సహదేవు లెదురువత్తురు.]

ఘటో—మీరందఱును శవములను తప్పించుకొని జాగ్రత్తగా నడచి రావలెను—ఇటు రక్తపుమడుగులు గలవు!!—దారి చూచి కొనుఁడు.

అర్జు—నాయనా! ఘటోత్కచా! లెక్కింప నలవిగాని యీశవము లెవ్వరియుద్ధమువలనఁ గలిగినవోయి!

ఘటో—అయ్యయ్యో!! ఎవ్వరివని యడిగెదవేమి: తమ్ముఁ డొకరిని రణమొనర్పనిచ్చినాఁడా!—ఒకరి కెడ మిచ్చినాఁడా!

అర్జు—ఆహాహా! ఒక్కమాఱు నాతండ్రి యుద్ధచాతుర్యమైనఁ జూచుకొనుటకు సమయము లభింపలేదుగదా!!...

గీ. కటకటా! యెందరినిఁ జంపి కయ్యమందు
వెన్నుఁజూపక ధైర్యంబు విడువఁబోక—
నరులయెడ సింహశాబమ వైతివయ్య!
కుఱ్ఱడా! బాల్యముననె యకుంఠితముగ.

[నడతురు—తెరలేచును—అభిమన్యుని కళేబరము కనఁబడును,

అర్జు—(తటాలున పైఁబడి శోకముతో) హా! నాతండ్రీ, నా

తండ్రీ !! — మరణించియు నీమొగమెంత కళకళ లాడుచున్న

దిరా నాయనా !

చ మొగమున కాంతివాయ, దరమోద్భాసకమంగవ దివ్యతేజ భా

సగరిమయెల్లదిక్కులకు వన్నియ వెట్టుచునుండ. పుత్రకా !

యగణితదివ్యసత్త్వుఁడవు ఆయువుబాసియు, ప్రాణపంచకం

బు గలిగినట్లు వెల్గితివి హా ఘన నెట్లు వెల్గగాఁడవో!!

హా! అభిమన్యూ! అభిమన్యూ!!

సీ. సంపెగనూనెవాసలచే గమగమ
లాడెడుమృదువులౌ నలకలివియె
పూర్ణచంద్రునిగేరు ముద్దాడు సందంపు
నెమ్మొగమాఁ యిది నిర్మలాంగ
కనకంపుఛాయల ననుకరించెడుమేని
కాంతులౌ యతనుసంకాశరూప
తమ్మిపూరేకుల దర్పంబు నడఁగించు
నేత్రంబులౌ యివి నీరజాక్ష !!

దర్పణంబుభాతి ధగధగలాడెడు
ఫాలతలము యిద్ది భాసురాంగ!
కన్నతండ్రినైన, నన్నుఁ జూడవదేల
మాటలాడవేల మాన్యచరిత!!

ఘటోత్కచా, వక్షముపైనున్న యీబల్లెపుపోటు గ్రుచ్చి యెత్తిన చందమున నున్నది! ఎవ్వరిదైయుండునో — అంత క్రూరకర్ముఁ డెవ్వఁడు

ఘటో — బాబూ దాశ్శాసనితోఁ బోరి నేలబడియున్న తఱి, కౌరవులు నాల్గువంకలును గవిసి కుంతములతోఁ బొడిచిరి అప్పటికి తన

పనికైమైనదని యెంచి పాపాత్ముడగు సైంధవుడు మాకు దారివదలితాను సరిగా బాలువడియున్న యెడ కగిగి మరణాసన్నుడగు బాలును బల్లెమునం బొడిచియెత్తెను అప్పుడు బాలు మరణించుచు, ఓరీ! సైంధవా! ఈదురితకృత్యము నాతండ్రివిన్న నీతల తరుగునురా! దుష్టా! యని పలికెను అయ్యయ్యో! బాలు ప్రాణము లాదుష్టునిపట్ల నెట్లు కొట్టుకొనుచున్నవో కదా!

అర్జు—(మహాక్రోధమునం) సరే! సైంధవచండాలా! మరణాసన్నుండగు పసిబాలునటరా నీవు కుంతముపాలు జేసితివి! నీమరణ మింక దాపురించినది! ఈపార్థుని బారినుండి యెందుబోంగలవు? ఓకృష్ణా! పాండవులారా! అందఱు నాలకింపుండు.

ఉ. భానుండు గ్రుంకకుండ పరిపంథిబలంబులు చూడచుండగా
హీనుని సైంధవాపసదునెల్లి వధింతు వధింపనేని స
న్మానితమైనగాండివము మారణముం బొనరించి తీవ్రఘో
రానలమందు భస్మముగ యాతయుజేసెద నీరణం బిక.

కృష్ణ—ప్రతిజ్ఞపట్టనేకూడదు పట్టినపిదప నంతపనియుం జేసితీరవ సినదేకదా!

[అనుబంధము 10)

(అందరును నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము



శ్రీరస్తు

# పద్మవ్యూహము

## షష్ఠాంకము

### ఒకటవరంగము.

[సైంధవుడు నిద్రలో ఉలికిపడి లేచును ప్రక్కన దుస్సల పరుండియుండును]

సైంధ—దేవీ! దేవీ! లెమ్ము లెమ్ము.

దుస్స—(లేచి) నాథా! ఏమియిది! తుల్లిపడి లేచితిరి. దుస్స్వప్నమేమైన వచ్చినదా!

సైంధ—అబ్బా! ఏమని చెప్పుదును? గుండెలిప్పటికినిఁ గొట్టుకొనుచున్నవి-దుస్స్వప్నమన్న దుస్స్వప్నమా!

దుస్స—నాథా! మనస్సును స్థిరపరచుకొని చెప్పుడు. ఏమిజరిగినది

సైంధ—నేనునిద్దురలో నున్నతరి తలలేనియొక మొండెమెక్కడనుండియోవచ్చి-నారొమ్ముపైఁ గూర్చుండి "ఓరీ సైంధవా! నేను మరణించినపిదప నీవు శూలముతోఁ బొడిచిన యభిమన్యుడను-నాప్రాణములింకనునీపట్లశోభించుచునే యున్నవి. నీవప్పుడే గడచి గట్టునఁబడితినని సంతసింపకుము. నాతండ్రి

రిపుహృద్గ్రుంతులోపల గొంతుఁ గోయక మానునను వాంటి వా పాపీ నేనే నీరక్తముపీల్చి యుందును; కాని నాకుతల లేనందున, నూరకుండవలసి వచ్చెను.” అని పలికి యంతర్హి తుండయ్యెను.

దుస్స—తలలేనివాఁ డెట్లు మాటాడెనో?

సైంధ—ఏమో ? అదేనాకును సందేహముగా నున్నది.

దుస్స—స్వప్నవార్తల కేమిగాని, అర్జునుని ప్రతిజ్ఞ నిజమో-యబ ద్ధమో తెలియఁదయ్యెఁగదా!

సైంధ—గూఢచారిని పంపి తెలిసికొందమా?

దుస్స—నిజమే. అది చేయదగినపని-(తెరవంకఁజూచి) ఉద్దాలకా! ఉద్దాలకా !

[ఉద్దాలకుఁడు ప్రవి॥]

ఉద్దా—దేవిగారి యానతికి వేచియున్నాను.

దుస్స—పాండవ శిబిరములకు గూఢముగా నరిగి, మా సైంధవప్రభు వుగారిని పాండవమధ్యముఁడు సంహరింపఁదలచిన వార్తలే మైనఁ దెలియునేమో యెఱిఁగిరమ్ము.

ఉద్దా—భాగ్యము. (నిష్క్రమించును.)

దుస్స—నాథా ! మీస్వప్నమునఁ గాన్పించిన శిరోవిహీన వ్యక్తి పలి కిన చందమే నిజమా ! మీ రాతడు ప్రాణావశిష్టుఁడై యుం డగా కుంతమునఁ బొడిచితిరా ?

సైంధ—దేవీ నీకును వెఱ్ఱియాయేమి ?—స్వప్నమున తలలేని మొండెము పలికిన పలుకులా నీకుప్రమాణములు ? ఆమా ట్టుకొని, చర్చింపఁ గడంగితివేమి ?

దుస్స—సరే ! ఇప్పుడు తొందరయేల ? ఉద్దాలకుఁడు రాకుండునా?
నిజవృత్తాంత మెఱిఁగింపకుండునా : నీడాంబిక వచనములయందలి సత్యాసత్యము లప్పుడే తెల్లము కాఁగలవు?

సైంధ—ఓ! అందులకు భీతిల్లెదనా?

(తరువాత ఉద్దాలకుఁడు వేగముగ—వచ్చి॥)

సైంధ—(స్వగ॥) వీఁడును వెంటనే వచ్చినాఁడు. నిజవార్తయేమి వెల్లడియగునో కదా ?

దుస్స—ఉద్దాలకా? అంతవేగముగ వచ్చితివేమి? ఏమివిశేషములు?

ఉద్దా—దేవీ! విశేషము లేమని చెప్పుటకును నోరాడుటలేదు. మహాపరిమాణము వచ్చినది ! రక్షణోపాయ మవశ్యాలోచనీయము !

సైంధ—జరిగిన సంగతియేమిరా ! దుష్టుఁడా!

ఉద్దా—దేవా ! అవధరింపుఁడు—తమరు? కౌరవు లందఱునుఁ గలపి శూలములతోఁ బొడిచిన పిదపఁ బ్రాణావశిష్టుఁడై యున్న యభిమన్యుకుమారుని కుంతముతోఁ బొడిచిరిఁట ఆవార్త నర్జునుఁడు విని దండతాడితమగు మహాసర్పము పగిది మండిపడుచు—రేపు పొద్దుగ్రుంకకుండ మిమ్ము సంహరించు నట్లును—అట్లు చంపలేకున్న—పావకజ్వాలం బడి గాండీవముతో భస్మమై పోవునట్లును ప్రతిజ్ఞ బూనెనట !—పాండవసేనలం దెచ్చటఁ జూచిన నీమాట చెప్పుకొనుచున్నారు.

దుస్స—ఓ సింధురాజ శూరశిఖామణీ !—ఇప్పుడైన, నిజము చెప్పెదవా లేదా?—చావసిద్ధమైన శూరబాలకుని, బల్లెముతో

బొడిచిన పరితాపశాలివా నీవు ? ఆహాహా ! నీశౌర్యము!—నీవంటి నిర్భాగ్యజన్ములు మఱి పలువురు జనించిన నిక భరతమాత కేమి కొదువ !

చ. పటుతరవిక్రమాఢ్యులను భవ్యచరితు్రల సత్యసంధులం
గటగట ! గర్భవార్ధిఁ బొడఁగాంచిన తల్లికి భారతాంబ కీ
విటుల జనించి, భారత మహీస్థలికిం దలవంపు దెచ్చి నీ
వటమట నందినాఁడవు గదా ! జనులందఱు నవ్విపోవఁగన్;

ఛీ! నీమొగము చూడఁగూడదు—నీభార్య ననిపించుకొనుట నాకును లజ్జాహేతువు!—......ఉద్దాలకా ? మామార్గ మేదియో మేము చూచుకొందుము నీదారిని నీవరుగుము.

ఉద్దా—అమ్మా ? సెలవు. (నిష్క్రమి॥)

దుస్స—ఓ లజ్జావిహీన రాజాధమా ? మాటడ వేమి ?

సైంధ—(సిగ్గుతో) దేవీ ? ఇంక నీవద్దబొంకిన నేమిలాభము ? కౌరవులు అభిమన్యుని పొడిచినపిదపనే నేను పొడిచితిని, ప్రాణము పోయినది మాత్రము నాబల్లెము పోటున కే—అంతవఱకునిజము—ఇంక నీవెన్నిమాటలైన నాడుము నిజము చెప్పితిని

దుస్స—ఇప్పుడు, నిన్నేమన్నను లాభములేదు సేవకా

(తెరలో)

అమ్మా

దుస్స—నీవు సత్వరముగా నరిగి మాపెద్దన్నయ్య నొక్కమాఱు రమ్మనుము.

(తెరలో)

అమ్మాళ్ళ చిత్రము.

సైంధ—దేవీ ! నాకిప్పుడొకచక్కని యోచన తోఁచుచున్నది— నేను, తటాలున, నెవ్వరికిఁ జెప్పకుండ మాఱువేషము వేసి కొని, యడవుల కరిగి సాయంకాలముదనుక తలదాచుకొంటినా—అప్పటికిఁ దనప్రతిజ్ఞా భంగమైన రోషవిషాదముల తో—పార్థుఁడు, గాండివసహితుఁడై యగ్నింగూలును— అంతటితో పాండవు లందఱుం జచ్చెదరు, రాజ్యమింక బావ పాలిటఁ బడును.

దుస్స—చాలు చాలు—ఈ యాలోచనము లెవ్వరును, నిన్నడుగ లేదు—మాయన్న వచ్చినపిదప నేనే కాళ్ళపైఁబడి ప్రార్థించెదను.

(దుర్యోధనుఁడు ప్ర॥

దుర్యో—ఏమి యిది ? అర్ధరాత్రమున భార్యాభర్తలు మంతనము లారంభించి నట్లున్నారు.

దుస్స—అన్నయ్యా ! బడలి నిద్రబోవుచున్న నిన్ను లేపించితినికా బోలును.

దుర్యో—ఇప్పటివఱకును మంత్రాలోంగముచేయుచునే గదా యుంటిమి. నేనే బావను పిలిపించితినిగాని, నేనేవచ్చిగాని' మాటాడుతలం పున నుండగా మీభటుఁడు వచ్చెను. అదివిని నే వచ్చితిని.

దుస్స—అర్ధరాత్రమున చేయుచున్న యీమంత్రాలోంగము మీబావ గారి విషయమేమై!యుండునా ?

దుర్యో—ఇప్పుడంతకన్న నత్యవసరకార్యము లేమియున్నవి ?

దుస్స—ఆవల మీరు మంత్రాంగము చేయుచుండగా—నీవల మీ బావగారు—ప్రాణావశిష్టుఁడగు నభిమన్యుని, శుంతమునఁ బొడిచిన శూరశిఖామణి— స్వప్రాణసంరక్షణార్థమై—పాండవుల దూరెదనని మంత్రాంగము చేయుచున్నారు.

దుర్యో—ఇందఱము మేము బ్రదికియుండగా పాండవుల కరిగెదవోయి బావా ? నీకేమియు ప్రాణభయము లేదు— ద్రోణాచార్యుల వారు చక్కని మంత్రాంగమునుఁ జేసిరి. రమ్ము.

దుస్స—అన్నయ్యా! నాపసుపుకుంకుమ నిల్పుభారము నీయదియే.

దుర్యో—రమ్మమ్మా! ఇంతమాత్రమునకే భీతిల్లెదవా!—బావా!

(అందఱును నిష్క్రమింతురు.)



# రెండవరంగము.



(సరోవరతీరమున అశ్వములకు నీరుపెట్టుచు, కృష్ణుడు)

కృష్ణు—(స్వగ) వెనుకముందు లాలోచింపకుండ, విజయుఁడు ఘోర ప్రతిజ్ఞఁ దాల్చినాఁడు. దీని కేదేని ప్రతివిధాన మాలోచింప కున్న ప్రమాదమే సంఘటిల్లునని తోఁచుచున్నది. ఇప్పుడు మాయలయం దారితేరిన మయుని సహాయమే కావలయునని తోఁచుచున్నది.

(మయుఁడు ప్రవేశము.)

మయు—(కృష్ణుని పాదములపైఁ బడి)

దండకము.

శ్రీకృష్ణ! శ్రీవాసుదేవా! హృషీకేశ! లోకేశ! సచ్చిద్విలాసా! నమోదైత్యనాశా! నమో శ్రీరమేశా! నమో! దివ్యవైకుంఠవాసా! జగజ్జాలముంగావ, భక్తాళినిం బ్రోవగా దీక్షగైకొన్న నీనామసంకీర్తనల్బాడి, సద్భక్తిచే నిన్ను మెప్పింతునో దేవ! లక్ష్మీకళత్రా! నమో లోకనేత్రా! నమో దేవమిత్రా! నమో స్తోత్రపాత్రా! నమస్తే—నమస్తే—నమః.

కృష్ణు—మయుఁడా! నేఁడు నీవలన, నొక చిత్రసంఘటనము జరుగవలసి యున్నది.

మయు—దేవా! దేవరయాజ్ఞ వినుటకు సిద్ధముగా నున్నాను.

కృష్ణ—ప్రొద్దు గ్రుంకకుండ సైంధవుం జంపెదననియు, అట్లు చేయ లేకున్న గాండీవముతో వహ్నింబడి మరణింతుననియు మన కిరీటి ప్రతిజ్ఞ చేసెను. కౌరవు లీసన్న తెలసి, చుట్టును బలమగు సేనను నిల్పి—సైంధవుని దాచిరి.

మయు—ఓహో! ప్రమాదమే వచ్చినది. అట్లయిన, నేనిపు డేమి చేయవలసియున్నది ?

కృష్ణ—నీమాయచే సూర్యుని గప్పివేయవలయును. అదిగాంచి సర్వ జనులును ప్రొద్దుగ్రుంకెనని భ్రమింతురు. సైంధవుడు ప్రాణ భీతిలేదని బయటకు వచ్చును. అప్పుడు సంహరింప నదనగును.

మయు—భాగ్యము-ఆజ్ఞాప్రకారము చేయుదును.

(ఇద్దరు నిష్క్రమింతురు.)



# మూడవ రంగము.



[కౌరవసేన చుట్టును గాంచియుండగా- నడుమ సైంధవుఁడు డాగియుండును]

దుర్యో—గురువర్యా ! ఇప్పటికొక్క జాముపొద్దున్నటులున్నది. ఇంతవఱకు సైంధవుని రక్షించితిమి. ఈయొక్క జామును గడిచినచో- పార్థునితోపాటు పాండవులందఱును మరణింపవలసినదేకద !

ద్రోణు—ఆయొక్కజాముమాత్ర మెంతలోగడచును? అర్జుని రథమును, కృష్ణుఁడు వెఱ్ఱివానివలె సేనయందంతటను ద్రిప్పుచున్నాఁడు - సైంధవునిపొడ గాన్పించుట లేదు.

దుర్యో—గురువర్యా! క్రమక్రమముగా దిశలు చీకటిపడుచున్నట్లున్నది; చూడుఁడు.

ద్రోణు—ఇదేమో- మాయవలె నున్నట్లున్నదే! కాకున్న నింత వేగముగ సూర్యాస్తమయ సమయ మగునా ?

[తెరలో]

ఓహో ! సేనలారా ! మనకందఱకును శుభకాలము వచ్చినది. జయము- కౌరవేశ్వరునకు జయము, సూర్యాస్తమయమైనది. ఇక సైంధవప్రాణభీతి తప్పి- పాండవమరణకాల మాసన్నమైనది.

దుర్యో—(ఆకాశముం జూచుచు ఆనందముతో) గురువర్యా ! సూర్యాస్తమయమగుటయే నిశ్చయము- చూచితిరా !

(ఇరువురును పైకి చూచుచుందురు )

[కృపార్జునులు ప్రవేశింతురు.]

అర్జు—బావా ! సైంధవుడు కాన్పింపఁడేమి :

కృష్ణు—తొందరపడక ఆవంకకే చూచుచుండుము.

సైంధ—(తలపైకి నిగిడించి) అర్జునా ! నన్నుచంపుటకు చేసిన నీప్రతిన యేమయ్యెనురా ! వాచాటా !

కృష్ణు—ఓరి చింకిచాటా ! ప్రతిజ్ఞ పూర్తియయ్యెనురా ! పార్థా! ఆలసింపకుము. విడుము శరమును-

సైంధ—ఆ ! ఆ ! అధర్మమా !

కృష్ణు—అధర్మముకాదు. పరిపూర్ణమగు ధర్మము!

[అర్జునుఁడు బాణమును వదలును. సైంధవుఁడు మరణించును. సూర్యదర్శనమగును.]

అందఱు—హా ! మోసము—మోసము—

[మరల తెరలో]

ఓహో ! పాండవులారా ! సైంధవుఁడు మరణించెను. పార్థుఁడే జయించెను.

కృష్ణు—పార్థా ! సైంధవునిశిరంబును క్రిందఁ బడనేయకుము. నేను చెప్పునంతదనుక. ఆకాశమందే బంతివలె నాడింపుచుండుము

అర్జు—చిత్తము- నీయాన-

కృష్ణు—రథమును సత్వరముగాఁ దోలుచున్నాము.

(రథముతో పరిక్రమింతురు!)

అర్జు—కృష్ణా ! ఇదేదియో ఆశ్రమమువలె నున్నది.

...ృష్ణు—మనగమ్యస్థాన మిదియే. ఈయాశ్రమము సైంధవుని తండ్రి
ది. తనకుమారుని శిరస్సు నెవ్వఁడు నేలఁబడ వేయునో-వాని
శిరంబు సహస్రశకలము లగుఁగాక యనియీవృద్ధ సింధురాజు
శపించెను. అతఁడిప్పుడు సాయంకాలార్ఘ్యప్రదానము చేయు
చున్నాఁడు-కావున నాతని దోసిట నీశిరమును పడఁగొట్టుము.
స్వశాపమున మరణింపఁగలఁడు.

...ర్జు—భాగ్యము—(కొట్టును)

[తెరలో]

ఓహో మునికుమారులారా! ఎక్కడినుండియో యొకశిర స్సా
కాశమునుండి యెగిరివచ్చి యర్ఘ్యమిడుచున్న మాగురువ
తుని హస్తాంజలింబడగా నాతఁడు భీతితో క్రిందకుఁ ద్రోసిఁ
వెంటనే తలపగిలి మరణించెను.

...ృష్ణు—పార్థా! వింటివిగదా! ఇఁక భీతిదక్కి రమ్ము; పోవుదము

(ఇద్దరును నిష్క్రమింతురు.)



# నాల్గవ రంగము.



పటకుటీరము.

[పంచపాండవులు, కృష్ణుఁడు ప్రి॥]

అర్జు—శ్రీకృష్ణా ! మహాపురుష ! నీఋణము దీర్చుటకు మే మిఁక

నెన్నిజన్మము లెత్తవలయునో కదా !

ద్రౌపది యానాడు దుఃఖార్తయై వేడ

సభలోనఁ గోక లొసంగినావు

లక్కయింటను మమ్ము నుక్కడగకయుండ

జేసి కూరిమిని రక్షించినావు

ఒరుల కజేయుఁడై యున్నభీష్మాచార్య

వీరు నాచేతఁ జంపించినావు

సారథముఖమునం దారోహణము జేసి

చిరము నాలోచనల్ జెప్పినావు

సైంధవహతకు నాచేతఁ జంపఁజేసి

కూర్చెదుజయం బిపుడు సమకూర్చినావు

అరులఁ జేరిన మాస్వరాజంబె కొంత

మయ్యె ; దాని సైతె మొసంగుమయ్య త్వరగ.

కృష్ణు—ధర్మజా ! ఇం కేమి కావలయును.

**ధర్మ**—నీదయచే నిప్పటికి కొంచెముకొంతగా మాకు జయమే లభించెనని చెప్పవచ్చును. ఐనను అడిగితివిగావున, లోకమంగళము నపేక్షించుచున్నాను.

గీ. భరతమాత గనెడు పుత్రవర్యులెల్ల
రింక నభిమన్యునట్లు వహింతురిగాక-
గాక మరణంబు నందక ఘనజయంబు
గాంచి యశముందుదురుగాక సంచితముగ.

**కృష్ణు**—తథాస్తు.

[అనుబంధము.)

పద్మవ్యూహనాటకమునందు

షష్ఠాంకము సర్వమును

సంపూర్ణము.



# అనుబంధము



## 1. అశ్వత్థామ. బ్యాగ్—ఆది.

ఓరీ బ్రహ్మవిద్వేషీ ! నీయుసురులింక గాచుకొమ్ము ఖలః॥ ఓ॥

రోరీ॥ ధీరుఁడవయి వీరుఁడవయి । నావయి । ధీరకార్యములనుఁజూపద గడటు॥ ఓ॥

ఖలమతీ । హతగతీ । ధృతగతీ । కాచుకొమ్ము నీగర్వము నార్చెద॥ఓరీ॥

దురహంకార సమన్వితుఁడవని । దుష్టనికృష్టాత్మక నావయి నిటు । నిరవశేషంబుగా పలుభాషల । నింద్యకర్మముల నాడెదవా ॥ ఓరోరి॥

## 2. అర్జునుడు, సురట—ఆదితాళము.

మనకెడగాని స । మయమందుననో ।

తనయా శౌర్యము । తగదు తగదు సుమి॥మ॥

సంశప్తకులను జయించినపిదప । సరగుసమూమయు।

నేనును వచ్చెద । మంతదనుక నీ । వలసటనందక

శాంతివహింపు మె । వ్వారలు చెప్పిన ॥మ॥

## 3 అశ్వత్థామ కేదార—ఆదితాళము

ఇదేశరసన్యాసము । పృథాకలుషహారిణా । రణధురీణ॥ ఇ॥
సదాసుగుణదూరా । కలహాగుణ । బుధాహితవిచారా । సభాసదు॥
లరయుచుండ । నమితచండకోపక । హాయితాత్ముడనై యచలధృతి॥ని॥

---

## 4. అభిమన్యుడు. బ్యాగ్—ఆది

ధీరమతిని । సువి । చారగతిని । నాహారునిఁ బరాభవించెదఁగా
వీరకుమారుఁడ ననుకీర్తిలను । దిశాంతములఁ బ్రాకించెదగా॥ధీ॥

జనకుని హృదయము । చక్రిధరునిమది । సదాముదంబును
ఘటియింపన్ । ఘనతర సాయకముల నామొగ్గర । మునుఁ బటావం
చలుగ నొనరించెద॥ధీ॥

---

## 5. అభిమన్యుఁడు—సురట—త్రిశ్రగతి.

ఇంత పిరికితనమూ । నీ । కెటులగల్గెనో సుమిత్రి॥ఇం॥
పంతగించి యీవ్యూహము । భండనమునఁ జారుమగతి।
విచ్ఛేదంబు నొనరించి । విజయమందఁ దలఁపవో॥ ఇం॥
ఒకరి సాయమేలా । మనకొకరి ; బలములేలా । ప్రకటితలో
కైకవీర వరుడనగు-మఁ జరియింపక ॥ఇం॥

---

6. సైంధవుఁడు—బ్యాగ్ రూపకం

ఈదినమున । కూలినయిన । బూదినలుప లేనోకో । మేదుర ఘనకీర్తిగని । యిమే మరణాం బొనరించెదరే ॥నీ॥
త్రిపురాంతకు । నివరంబున । దివ్యశౌర్య యుతుఁడనై । యుప మానవి । రహితంబుగ । కృపావిదూరత గెలిచెద॥ నీ॥

---

7. అభిమన్యుఁడు

కపట ద్యూతముగాదు సుమా యిది । ఖలమతీ । హాగతీ సుయోధనా॥

విపదంబుధి । నిక మను ముంపంగలవే । యటుదలచితి వేమొకాని దుష్కపటి?

అమాయకుండగు । యమాత్మజుని నీ . వఖిల కష్టములయం దు ముంచితివి । సమాన రహితుఁడ । సుమాదురితమతి । యమాల యంబున । కంపెద నిదె నిను ॥క॥

---

8 అభిమన్యుఁడు—నాథనామక్రియ—ఆది

ధన్యుఁ డాతఁడు గదా । నాకన్న ॥ధన్య॥

మాన్యుండుగదా । మహాత్ముండగు గద । మానితమగు రణ మరణమునందును ॥ధ॥

ఎంతటి పుణ్యముఁ జేసిన వారిక నంతమైన రణ మర



ము గ్గ ను । వంతయేల మన । స్వరాజ్యమున కయి । రక్త
ల్చిన రణశూరు డతఁడు ॥ధ॥

---

9. అర్జునుఁడు—ఫీలు—త్రిశ్రిగతి.

ఎంత దైవదుర్విపాక । మెంతటి సుతసంతాప । మెంతలోన
ంటియుల్లెను । హా ! హా ! హా ! హా ॥ఎంత॥

హాంతకులై కురుకుమారు లింతటి ద్రోహము సలుపగ । సం
ాపము తలఁదాల్చితి । సాహసింప లేనైతి ॥నెం॥

కటకటా మహాదుర్భర । గర్భశోక మరులనైన । నటపుట
ంచింద రాదు హా ! హా ! హా ! హా ॥ఎం॥

---

10. అర్జునుఁడు—బ్యాగ్—ఆది.

దురాత్ముఁడగు సైం । ధవాపసదు నే । డరాతులర యుగ వధి
యుంతుఁగ । పరాక్రమించెద । దురంబునందున । ప్రిభాకరుఁడు గ్రుం
కియుండఁగ ॥దు॥

అటుగా దేసియు । హాతంబగుదు । గాం । డివంబుతో ఘన
రుపమాన పావకకీలఁగ ॥దు॥

అకౌరవము నే । డశ్రాశ్రివము నే । డగుఁన్ వివాదము లిక నే
లా । యకారణంబుగ ॥ సాత్మతనూజుని । హాతంబుఁ జేసిన । యా
మద్విరోధి ॥దు॥

---

# అదృష్టదీపిక.



(కర్త: వురిటి సూర్యనారాయణరావు)

సోదరా! నీయదృష్టము నొకసారి చూచుకొనుము.

"అదనునకు అందని అప్పుల" వలె నీయదృష్టమును యెవరెన్ని విధములఁ జెప్పినను, తప్పో, ఒప్పో కాకపోదు మొగమోటమునకు కలతెరఁగంతయు తెలుపక నిన్ను చీకాకుపరచు నవసరములేకుండ దురదృష్టగ్రహశాంతికొరకు నీ "అదృష్టదీపిక" కరదీపికగా నుండగలదను నమ్మకముతోఁ బెక్కుసంగతులు జేర్చి, ముహూర్తభాగము, జాతకభాగములు, సాముద్రికభాగము, వాస్తుప్రకరణము, ప్రశ్న భాగము, గౌళీశాస్త్రము శకునభాగం అను 8 భాగములు గలసి ఒక పుస్తకము బయిండు చేసియున్నాము. సర్వజనులకుపకరించునదిగనుక వెల 0-10-0.

# సాముద్రికశాస్త్రము.



(వ్యాఖ్యాత వురిటి సూర్యనారాయణరావు)

భారతీసోదరా !

నీచేతిని నీజీవితమును యితరులయెదుట బెట్టనవసరములేదు. భారతభూమియందలి పారిశ్రామికాది వృత్తులతోబాటు ప్రాచీనశాస్త్రమనునీపుస్తకమే యుదాహరణము, దీనిని తిలకించి నీశరీరమందలిసర్వభాగములందును గలసర్వరేఖలయొక్క ఫలితములను యితరులసాయమక్కఱలేకయే తెలిసికొందువు. సర్వజనాదరణంబును బడసిన యీగ్రంథమును పండితారాధ్యులురచించిరి. దీనియందలి శిథిల భాగముల పూర్తిచేయించి తాత్పర్యసహితంబుగా సిరతురకుక్షికైనను యర్థమగునటులనచ్చొత్తించితిమి, పండితులకంటె ముందు పామరులు చూడదగినది.

వెల 0—6—0.

కాయల కన్నయ్యనాయుఁడు అండ్ సన్సు,
రామకృష్ణాబుక్ డిపో, ఏలూరు.